(పెరుమాళ్ల ముందు స్థలమును శుద్ధిచేసి ప్రసాదమును ఫలాదులను అన్నిటినీ ఉంచి)

**ఓం సమస్త పరివారాయ సర్వదివ్యమంగళవిగ్రహాయ**

**శ్రీమతే నారాయణాయ నమః**

**అర్ఘ్యం సమర్పయామి, పాద్యం సమర్పయామి,**

**ఆచమనీయం సమర్పయామి**

(ప్రసాదమును ప్రోక్షించి, తులసి ఉంచి సురభి ముద్రను చూపి మృగముద్రతో ఆరగింపు చేయాలి.)

**పాయసాన్నం గూడాన్నంచ ముద్గాన్నం శుద్ధమోదనమ్ ।**
**దధిక్షీరాజ్యసంయుక్తం నానాశాకఫలాన్వితమ్ ॥**
**అపూపాన్ వివిధాన్ స్వాదూన్ శాలిపిష్టోపపాదితాన్**
**పృథుకాన్ గుడసమ్మిశ్రాన్ సజీరకమరీచికాన్ ॥**

**అన్నం చతుర్విధం జ్ఞేయం క్షీరాన్నం ఘృతశర్కరమ్ ।**
**పంచధా షడ్రసోపేతం గృహాణ మధుసూదన ॥**
**యా ప్రీతిర్విదురార్పితే, మురరిపో ! కుంత్యర్పితే యాదృశీ,**
**యా గోవర్ధనమూర్ధ్ని యా చ పృథుకే, స్తన్యే యశోదార్పితే**
**భారద్వాజసమర్పితే, శబరికాదత్తేధరే యోషితాం**
**యా ప్రీతిర్మునిపత్ని భక్తిరచితేప్యత్రాపి తాం తాం కురు ॥**

**'ఓమ్ ఓమ్ ఓమ్'**

(అనుచు స్వామికి మృగముద్ర కానీ, గ్రాసముద్ర కానీ చూపుతూ ఆరగింపు చేయాలి.)

**మధ్యే మధ్యే పానీయం సమర్పయామి**



**హస్తౌ ప్రక్షాళయామి, పాదౌ ప్రక్షాళయామి.**

**గండూషణం సమర్పయామి**

(పుక్కిలించు తీర్థమునందించండి)

**తాంబూలం సమర్పయామి**

(హారతి వెలిగించి నిల్చొని స్వామికి చూపండి)



## మంగళాశాసనము

**లక్ష్మీచరణలాక్షాంకసాక్షి శ్రీవత్సవక్షసే ।**
**క్షేమంకరాయ సర్వేషాం శ్రీరంగేశాయ మంగళమ్ ॥**
**శ్రియః కాంతాయ కళ్యాణనిధయే నిధయేర్థినామ్ ।**
**శ్రీవేంకటనివాసాయ శ్రీనివాసాయ మంగళమ్ ॥**
**అస్తు శ్రీస్తనకస్తూరీవాసనావాసితోరసే ।**
**శ్రీహస్తిగిరినాథాయ దేవరాజాయ మంగళమ్ ॥**
**కమలాకుచకస్తూరీ కర్దమాంకిత వక్షసే ।**
**యాదవాద్రినివాసాయ సంపత్పుత్రాయ మంగళమ్ ॥**
**నీలాచలనివాసాయ నిత్యాయ పరమాత్మనే ।**
**సుభద్రా బలభద్రాభ్యాం జగన్నాథాయ మంగళమ్ ॥**
**స్వోచ్ఛిష్టమాలికాబంధ గంధబంధుర జిష్ణవే ।**
**విష్ణుచిత్తతనూజాయై గోదాయై నిత్యమంగళమ్ ॥**
**శ్రీనగర్యాం మహాపుర్యాం తామ్రపర్ణ్యుత్తరే తటే ।**
**శ్రీతింత్రిణీమూలధామ్నే శఠకోపాయ మంగళమ్ ॥**
**శేషో వా సైన్యనాథోవా శ్రీపతిర్వేతి సాత్త్వికైః ।**

వితర్క్యాయ మహాప్రాజ్ఞైః భాష్యకారాయ మంగళమ్ ॥
తులామూలావతీర్ణాయ తోషితాఖిలసూరయే ।
సౌమ్యజామాతృమునయే శేషాంశాయాస్తు మంగళమ్ ॥
మంగళాశాసనపరైః మదాచార్యపురోగమైః ।
సర్వైశ్చ పూర్వై రాచార్యైః సత్కృతాయాస్తు మంగళమ్ ॥
సమస్తపరివారాయ సర్వదివ్యమంగళవిగ్రహాయ
శ్రీమతే నారాయణాయ నమః,
సువర్ణమంత్రపుష్పం సమర్పయామి
సమస్త పరివారాయ, సర్వదివ్యమంగళ విగ్రహాయ
శ్రీమతే నారాయణాయ నమః,
చామరోపచారం సమర్పయామి.

## శాత్తుముఱై

ఈ శాత్తుముఱై పాశురములు ఒక్కొక్కటి రెండుసార్లు విన్నవించవలెను.

శిఱ్ఱమ్ శిఱుకాలే వన్దు ఉన్నై చ్చేవిత్తు, ఉన్
పొఱ్ఱామరై యడియే పోఱ్ఱుమ్ పొరుళ్ కేళాయ్!
పెఱ్ఱమ్ మేయ్త్తుణ్ణుమ్ కులత్తిల్ పిఱన్ద నీ
కుఱ్ఱేవల్ ఎజ్గళై క్కొళ్ళామల్ పోకాదు
ఇఱ్ఱైప్పఱై కొళ్వా నన్రు కాణ్ గోవిందా!
ఎఱ్ఱైక్కుం మేఴ్ఏఴ్ పిఱవిక్కుమ్ ఉన్దన్నోడు
ఉఱ్ఱోమే యావోమ్ ఉనక్కే నామ్ ఆట్చెయ్వోమ్
మఱ్ఱైనమ్ కామజ్గళ్ మాఱ్ఱు ఏలోర్ ఎమ్బావాయ్

వజ్గ క్కడల్ కడైన్ద మాదవనై క్కేశవనై
త్తిజ్గళ్ తిరుముకత్తు చ్చేయిఴైయార్ శెన్నిఱైఞ్జి
అజ్గప్పఱై కొణ్డ వాఱ్ఱై అణిపుదువై



పైజ్గమల త్తణ్డెరియల్ పట్టర్ పిరాన్ కోదై శొన్న
శజ్గత్తమిఴ్మాలై ముప్పదుమ్ తప్పామే
ఇజ్గు ఇప్పరిశురైప్పార్ ఈరిరణ్డు మాల్వరైత్తోళ్
శెజ్గణ్ తిరుముకత్తు చ్చెల్వ త్తిరుమాలాల్
ఎజ్గుమ్ తిరువరుళ్ పెఱ్ఱు ఇన్బుఱువర్ ఎమ్బావాయ్

(హారతి వెలిగించి స్వామికి చూపుతూ ఈ పాశురము విన్నవించవలెను.)

పల్లాణ్డు పల్లాణ్డు పల్లాయిత్తాణ్డు, పలకోడి నూఱాయిరమ్
మల్లాణ్డ తిణ్డోళ్ మణివణ్ణా, ఉన్ శేవడి శెవ్వి తిరుక్కాప్పు ।
అడియోమోడుమ్ నిన్నోడుమ్ పిరివిన్ఱి ఆయిరమ్ పల్లాణ్డు
వడివాయ్ నిన్ వలమార్బినిల్ వాఴ్గిన్ఱ మంగైయుం పల్లాణ్డు
వడివార్ శోది వలత్తుఱైయుమ్ శుడరాఴియుమ్ పల్లాణ్డు
పడైపోర్ పుక్కు ముఴజ్గుమ్ అప్పాఞ్చశన్నియముం పల్లాణ్డే ॥

(5 పాత్రలలోని తీర్థాన్ని 6వ పెద్దపాత్రలో ఉంచి ఆ తీర్థాన్ని అందరికి వినియోగం చేస్తూ)

సర్వదేశదశాకాలేషు అవ్యాహతపరాక్రమా ।
రామానుజార్యదివ్యాజ్ఞా వర్ధతా మభివర్ధతామ్ ॥

రామానుజార్యదివ్యాజ్ఞా ప్రతివాసర ముజ్జ్వలా ।
దిగంతవ్యాపినీ భూయాత్ సా హి లోకహితైషిణీ ॥

శ్రీమన్ శ్రీరంగశ్రియం అనుపద్రవామ్ అనుదినం సంవర్ధయ ।
శ్రీమన్ శ్రీరంగ శ్రియం అనుపద్రవామ్ అనుదినం సంవర్ధయ ॥

నమః శ్రీశైలనాథాయ కుంతీనగరజన్మనే ।
ప్రసాదలబ్ధపరమప్రాప్య కైంకర్యశాలినే ॥

శ్రీశైలేశదయాపాత్రం ధీభక్త్యాదిగుణార్ణవమ్ ।
యతీంద్రప్రవణం వందే రమ్యజామాతరం మునిమ్ ॥

వాఴితిరువాయ్ మొఴిప్పిళ్ళై, మాదగవాల్ వాఴుమ్;
మణవాళ మామునివన్ వాఴియవన్;
మాఱన్ తిరువాయ్మొఴి ప్పొరుళై మానిలత్తోర్
తేఱుమ్బడి యురైక్కుం శీర్,
శెయ్యతామరై త్తాళిణై వాఴియే,
శేలైవాఴి తిరునాబి వాఴియే,
తుయ్యమార్బుమ్ పురినూలుమ్ వాఴియే,
సుందరత్తిరుత్తోళిణై వాఴియే,
కైయుమ్ ఏందియ ముక్కోలుమ్ వాఴియే
కరుణైపొఙ్గియ కణ్ణిణై వాఴియే
పొయ్యిలాద మణవాళ మాముని
పున్ది వాఴి పుగఴ్ వాఴి వాఴియే
అడియార్గళ్ వాఴ, అరంగనర్ వాఴ
శఠకోపన్ తణ్ తమిఴ్ నూల్ వాఴ,
కడల్ శూఴ్న్ద మన్నులగమ్ వాళ
మణవాళమామునియే ఇన్నుమొరు నూత్తాండిరుమ్ ॥

కోదై పిఱన్దవూర్ గోవిన్దన్ వాఴుమూర్,
శోదిమణిమాడమ్ తోన్రుమూర్, నీదియాల్
నల్లపత్తర్ వాఴుమూర్, నాన్మరైగళోదుమూర్
విల్లిపుత్తూర్ వేదక్కోనూర్
పాతకఙ్గళ్ తీర్కుమ్ పరమనడి కాట్టుమ్,
వేదమనైత్తుక్కు విత్తాగుమ్, కోదై తమిఴ్
ఐయైన్దు మైన్దుం అఱియాద మానిడరై,
వైయం శుమప్పదుం వమ్బు ।
తిరువాడిప్పూరత్తిల్ శెగత్తుదిత్తాళ్ వాఴియే



తిరుప్పావై ముప్పదుమ్ శెప్పినాళ్ వాఴియే
పెరియాఴ్వార్ పెత్తెడుత్త పెణ్పిళ్ళై వాఴియే,
పెరుమ్బూదూర్ మామునిక్కు ప్పిన్నానాళ్ వాఴియే,
ఒరునూత్తు నాఱ్పత్తు మూన్రురైత్తాళ్ వాఴియే,
ఉయరరఙ్గర్కే కణ్ణియుగన్దళిత్తాళ్ వాఴియే,
మరువారుం తిరుమల్లి వళనాదు వాఴియే,
వణ్పుదువైనగర్ కోదై మలర్ పదఙ్గళ్ వాఴియే,

శ్రీమతే రమ్యజామాతృమునీంద్రాయ మహాత్మనే ।
శ్రీరంగవాసినే భూయాత్ నిత్యశ్రీః నిత్యమంగళమ్ ॥

సమస్తపరివారాయ సర్వదివ్యమంగళవిగ్రహాయ
శ్రీమతే నారాయణాయ నమః
పర్యంకాసనం సమర్పయామి
(పెరుమాళ్ళను మనసులోనికి ఆహ్వానించి శయనోత్సవము చేయండి)
(నిల్చొని క్షమాప్రార్థన చేయండి)
మంత్రహీనం క్రియాహీనం భక్తిహీనం జనార్దన ।
యత్కృతం తు మయా దేవ ! పరిపూర్ణం తదస్తు తే॥
ఉపచారాపదేశేన కృతానహరహర్మయా ।
అపచారానిమాన్ సర్వాన్ క్షమస్వ పురుషోత్తమః ॥
స్వస్తి ప్రజాభ్యః పరిపాలయన్తాం
న్యాయ్యేన మార్గేణ మహీం మహీశాః ।
గోబ్రాహ్మణేభ్య శ్శుభమస్తు నిత్యం
లోకా స్సమస్తా స్సుఖినోభవన్తు ॥
కాలే వర్షతు పర్జన్యః పృథివీ సస్యశాలినీ ।
దేశోయం క్షోభరహితః బ్రాహ్మణా స్సన్తు నిర్భయాః ॥
కావేరీ వర్ధతాం కాలే కాలే వర్షతు వాసవః ।

**శ్రీరంగనాథో జయతు శ్రీరంగ శ్రీశ్చ వర్ధతామ్ ॥**
**కాయేన వాచా మనసేంద్రియైర్వా**
**బుద్ధ్యాత్మనా వా ప్రకృతే స్స్వభావత్ ।**
**కరోమి యద్యత్ సకలం పరస్మై**
**నారాయణాయేతి సమర్పయామి ॥**

**శ్రీమన్నారాయణాయేతి సమర్పయామి ॥**

**పన్నగాధీశ పర్యంకే రమాహస్తోపధానకే ।**
**సుఖం శేష్వ వృషాధీశ ! సుదర్శనసురక్షితః ॥**

**శంఖచక్రగదాఖడ్గదివ్యాయుధగణస్తథా**
**శ్రీశరక్షావిధానాయ సదా జాగృత జాగృత ॥**

(సాష్టాంగం నమస్కరించి పెరుమాళ్ళ కవాటబంధనం చేయాలి. అనగా–తలుపులు వేయవలెను.)

(రాత్రి యందు పెరుమాళ్ళకు అర్ఘ్యపాద్యాదికములు సమర్పించి పుష్పములతో అర్చన చేసి ధూపదీపములనిచ్చి ఆరగింపు చేసి మంగళాశాసనము చేయవలెను. అవకాశమున్నచో శ్రీకృష్ణాష్టకము, పంచాయుధ స్తోత్రము, శ్రీలక్ష్మీఅష్టోత్తర శతనామ స్తోత్రము, శ్రీవిష్ణుసహస్రనామ స్తోత్రమును అనుసంధించుకొనవచ్చును.)

సర్వమ్ శ్రీ కృష్ణార్పణమస్తు

**పితరం మాతరం దారాన్ పుత్రాన్ బంధూన్ సఖీన్ గురూన్ ।**
**రత్నాని ధనధాన్యాని క్షేత్రాణి చ గృహాణి చ ॥**

**సర్వధర్మాంశ్చ సంత్యజ్య సర్వకామాంశ్చ సాక్షరాన్ ।**
**లోకవిక్రాంతచరణౌ శరణం తేవ్రజం విభో! ॥**

విభో = ప్రభూ, పితరం మాతరం దారాన్ బంధూన్ పుత్రాన్ సుఖీన్ గురూన్ = తండ్రిని, తల్లిని, భార్యను, బంధువులను, పుత్రులను, మిత్రులను, గురువులను, రత్నాని= రత్నాలను, ధనధన్యాని = ధనాన్ని, ధాన్యాన్ని, క్షేత్రాణి చ = క్షేత్రాలను, గృహాణి చ = గృహాలను,

సర్వధర్మాన్ చ = అన్ని ధర్మాలను, సాక్షరాన్ సర్వకామాన్ చ = కైవల్యం తో పాటుగా అన్ని కోరికలను, (స్వర్గలోకాధిపత్యం, బ్రహ్మలోకాధిపత్యం మొదలైనవానిలోని ఆశను – అని భావం) సంత్యజ్య = వాసనతోపాటుగా వదలిపెట్టి, తే లోకవిక్రాంత చరణౌ= లోకాలను కొలిచిన నీ శ్రీచరణ యుగ్మాన్ని, శరణం ప్రపద్యే = శరణు పొందుతున్నాను.

**త్వ మేవ మాతా చ పితా త్వమేవ త్వమేవ బంధుశ్చ గురు స్త్వమేవ ।**
**త్వమేవ విద్యా ద్రవిణం త్వమేవ త్వమేవ సర్వం మమ దేవదేవ ! ॥**

దేవదేవ = ఓ దేవదేవా!, మాతా చ త్వ మేవ పితా చ త్వమేవ = తల్లివి నీవే, తండ్రివి కూడా నీవే, బంధుశ్చ త్వమేవ గురుశ్చ త్వమేవ = బంధువు నీవే, గురువు నీవే, విద్యా త్వమేవ ద్రవిణం త్వమేవ = జ్ఞానం నీవే, అర్థం నీవే, మమ సర్వం త్వమేవ= నాకు సర్వం నీవే.

**పితాసి లోకస్య చరాచరస్య త్వమస్య పూజ్యశ్చ గురు ర్గరీయాన్ ।**
**న త్వత్సమోస్త్యభ్యధికః కుతోన్యో లోకత్రయే ప్యప్రతిమప్రభావ!॥**

అప్రతిమప్రభావ = సాటి లేని మేటి వైభవాన్ని కలవాడా!, త్వమ్ అస్య చరాచరస్య లోకస్య పితా అసి = స్థావర జంగమాత్మకమైన ఈ లోకానికి అంతటికి తండ్రివై ఉన్నావు, అస్య లోకస్య పూజ్యః గురుశ్చ అసి = ఈ లోకానికి పూజింప దగిన ఆచార్యుడవై ఉన్నావు కనుక, ఈ లోకానికి అంతటికి పూజ్యతముడవు నీవే, లోకత్రయే అపి త్వత్ సమ్మ అన్యః నాస్తి = కారుణ్యం మొదలైన గుణాలలో నీతో సమానుడు ముల్లోకాలలోను వేఱొకడు లేదు, అభ్యధికః కుతః=సమానుడే లేదు అనినపుడు, గొప్పవాడు లేదు అనే విషయం చెప్పాలా!

**తస్మాత్ ప్రణమ్య ప్రణిధాయ కాయం ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్ ।**
**పితేవ పుత్రస్య సఖేవ సఖ్యుః ప్రియః ప్రియాయార్హసి దేవ! సోఢుమ్ ॥**

తస్మాత్ = పూర్వశ్లోకంలో చెప్పిన రీతిలో నీవు సర్వస్మాత్పరుడవై ఉన్నందు వల్ల, అహం =లోటు పాట్లు మూర్తీభవించినవాడనై ఉండే నేను, ఈశమ్ ఈడ్యమ్ త్వాం = సర్వనియంతవుగాను, స్తోత్రార్హుడవుగాను ఉండే నిన్ను, కాయం ప్రణిధాయ

ప్రణమ్య = (వేఱు తెగిన చెట్టువలె), శరీరాన్ని నేలపై మోపి, సాష్టాంగంగా నమస్కరించి, ప్రసాదయే = క్షమను అభ్యర్థిస్తున్నాను, దేవ = దేవా!, పుత్రస్య (దోషం) పితా ఇవ = పుత్రుని దోషాన్ని తండ్రి క్షమించినట్లు, సఖ్యుః దోషమ్ సఖా ఇవ = మిత్రుని అపరాధాన్ని మిత్రుడు సహించినట్లు, ప్రియాయ (మహ్యమ్) = ప్రియుడనైన నాపట్ల, ప్రియః (త్వమ్) సోఢుమ్ అర్హసి = ప్రియుడవైన నీవు (నా అపరాధాలను) క్షమించు.

**మనోవాక్కాయై రనాదికాలప్రవృత్తానంతాకృత్యకరణకృత్యాకరణ భగవద పచార భాగవతాపచారాసహ్యాపచారరూప నానావిధానంతాపచారాన్ ఆరబ్ధకార్యాన్ అనారబ్ధ కార్యాన్ కృతాన్ క్రియమాణాన్ కరిష్యమాణాంశ్చ సర్వానశేషతః క్షమస్వ ॥**

మనోవాక్కాయైః = మనస్సు, వాక్కు, శరీరం = అనే మూడు కరణాలతో, అనాదికాలప్రవృత్త = మొదలు తెలియని నాటినుండి ప్రవృత్తమైన, అనవరత= నిలుపులేని, అకృత్యకరణ = చేయకూడని కార్యాలను చేయడం, కృత్య + అకరణ= చేయవలసిన కార్యాలను చేయకపోవడం, భగవత్+అపచార = భగవానునిపట్ల అపచారపడడం, భాగవత+అపచార = భగవద్భక్తుల విషయంలో అపచారపడడం, అసహ్య+అపచార = సహించడానికి సాధ్యం కాని రీతిలో అపచారపడడం – అనే రీతిలోని, నానావిధ+అనంత+అపచారాన్ = పలు రీతులలోని, అపరిమితాలైన అపచారాలను (దీనికి "అశేషతః క్షమస్వ" అనే దానితో అన్వయం) అశేషతః = అణువు అంతకూడా శేషించకుండా పూర్తిగా, సర్వాన్ క్షమస్వ = అన్నిటిని క్షమించు,

ఆరబ్ధకార్యాన్ = ఫలాన్ని ఇవ్వడం ఆరంభించిన అపచారాలను, అనారబ్ధ కార్యాన్= ఇంక ఫలాన్ని ఇవ్వడం ఆరంభించని పాపాలను, కృతాన్ = గడచిన కాలంలో చేయబడిన పాపాలను, క్రియమాణాన్ = వర్తమానకాలంలో చేయబడు తున్న పాపాలను, కరిష్యమాణాన్ చ = భవిష్యత్కాలంలో చేయబడే పాపాలను, (క్షమస్వ = క్షమించు).

**అనాదికాలప్రవృత్తం విపరీతజ్ఞానమాత్మవిషయం, కృత్స్నజగద్విషయం చ విపరీత వృత్తం చాశేషవిషయ మద్యాపి వర్తమానం వర్తిష్యమాణం చ సర్వం క్షమస్వ॥**

అనాదికాలప్రవృత్తం = ఆది తెలియని కాలంనుండి ఆరంభమైనది, ఆత్మ విషయం కృత్స్నజగద్విషయం చ విపరీతజ్ఞానం = ఆత్మకు చెందినది, సమస్త జగత్తును గూర్చినది అయిన విపరీతజ్ఞానాన్ని (క్షమించాలి), అశేష విషయం= అన్నిటిని విషయంగా కల్గినది, అద్యాపి వర్తమానం = ఇంకా ఈనాటికీ అనువర్తించి ఉన్నది, వర్తిష్యమాణం చ =



ఇకపైకూడా వాసనాబలంవల్ల సంభవించబోయేది, సర్వం చ విపరీతవృత్తం క్షమస్వ = సర్వమైన నిషిద్ధాను ష్ఠానాన్ని క్షమించు.

**మదీయానాది కర్మప్రవాహప్రవృత్తాం, భగవత్స్వరూప తిరోధానకరీం, విపరీత జ్ఞానజననీం, స్వవిషయాయాశ్చ భోగ్యబుద్ధేర్జననీం, దేహేంద్రియత్వేన భోగ్యత్వేన సూక్ష్మరూపేణ చావస్థితాం, దైవీం గుణమయీం మాయాం, దాసభూతం "శరణా గతోஉస్మి తవాస్మి దాసః" ఇతి వక్తారం మాం తారయ ॥**

మదీయ+అనాది కర్మ ప్రవాహప్రవృత్తాం = చిరకాలంగా నేను చేస్తూ వచ్చిన కర్మపరంపరలచే ఏర్పడినది, భగవత్స్వరూప తిరోధానకరీం = భగవానుని స్వరూపాన్ని తెలిసికోనీయకుండా మఱుగుపరచేది, విపరీతజ్ఞాన జననీం = దేహాత్మ భ్రమ మొదలైన విపరీతజ్ఞానాలను కల్గించేది, స్వవిషయాయాః భోగ్యబుద్ధేః + చ జననీం = స్వకార్య రూపమైన శబ్దాదివిషయాలలో భోగ్యబుద్ధిని కల్గించేది, దేహేంద్రియత్వేన భోగ్యత్వేన సూక్ష్మరూపేణ చ అవస్థితామ్ = భోగస్థానమైన దేహ రూపంతోను, భోగోపకరణాలైన ఇంద్రియాల రూపంతోను, భోగ్యమైన శబ్దాదుల రూపంతోను – వీటికి అన్నిటికి మూలకారణమైన సూక్ష్మ ప్రకృతిరూపంతోను (ఈ విధంగా నాల్గు విధాలైన పరిణామాలను కల్గినదై ఉండే), దైవీం = దేవుడనే పేరును కల నీచే క్రీడాపరికరంగా గ్రహింపబడినదైన, గుణమయీం= సత్త్వరజస్తమోగుణ రూపమైన, మాయామ్= విచిత్రకార్యకరం కనుక మాయ అనే పేరును పొందిన ప్రకృతిని, (దీనికి "మామ్ తారయ" అనే దానితో అన్వయం)

## శ్రీలక్ష్మీ అష్టోత్తర శతనామస్తోత్రము

**దేవ్యువాచ –**
**దేవ దేవ! మహాదేవ! త్రికాలజ్ఞ! మహేశ్వర! ।**
**కరుణాకర! దేవేశ! భక్తానుగ్రహకారక! ॥**

**అష్టోత్తర శతం లక్ష్మ్యాః శ్రోతు మిచ్ఛామి తత్త్వతః ।**

ఈశ్వర ఉవాచ –
దేవి! సాధు! మహాభాగే! మహాభాగ్య ప్రదాయకమ్ ॥

సర్వైశ్వర్యకరం పుణ్యం సర్వపాప ప్రణాశనమ్ ।
సర్వదారిద్ర్య శమనం శ్రవణాత్ భుక్తి ముక్తిదమ్ ॥

రాజవశ్యకరం దివ్యం గుహ్యాద్గుహ్యతరం పరమ్ ।
దుర్లభం సర్వదేహనాం చతుష్షష్టి కళాస్పదమ్ ॥

పద్మాదీనాం వరాంతానాం నిధీనాం నిత్యదాయకమ్ ।
సమస్తదేవసంసేవ్యం అణిమాద్యష్టసిద్ధిదమ్ ॥

కిమత్ర బహునోక్తేన దేవీప్రత్యక్షదాయకమ్ ।
తవ ప్రీత్యాऽద్య వక్ష్యామి సమాహితమనా శ్శృణు ॥

అష్టోత్తరశతస్యాస్య మహాలక్ష్మీస్తు దేవతా ।
క్లీం బీజపద మిత్యుక్తం శక్తిస్తు భువనేశ్వరీ ॥

అంగన్యాసః కరన్యాసః స ఇత్యాది ప్రకీర్తితః

ధ్యానమ్

వందే పద్మకరాం ప్రసన్నవదనాం సౌభాగ్యదాం భాగ్యదాం
హస్తాభ్యామ్ అభయప్రదాం మణిగణైః నానావిధైః భూషితామ్ ।
భక్తాభీష్ట ఫలప్రదాం హరిహర బ్రహ్మాదిభి స్సేవితాం
పార్శ్వే పంకజ శంఖపద్మనిధిభిః యుక్తాం సదా శక్తిభిః ॥

సరసిజనయనే! సరోజహస్తే! ధవళతరాంశుక గంధమాల్యశోభే! ।
భగవతి! హరివల్లభే! మనోజ్ఞే! త్రిభువన భూతికరి! ప్రసీద మహ్యమ్ ॥

ప్రకృతిం వికృతిం విద్యాం సర్వభూతహితప్రదామ్ ।
శ్రద్ధాం విభూతిం సురభిం నమామి పరమాత్మికామ్ ॥ 1

వాచం పద్మాలయాం పద్మాం శుచిం స్వాహాం స్వధాం సుధామ్ ।
ధన్యాం హిరణ్మయీం లక్ష్మీం నిత్యపుష్టాం విభావరీమ్ ॥ 2



అదితిం చ దితిం దీప్తాం వసుధాం వసుధారిణీమ్ ।
నమామి కమలాం కాంతాం క్షమాం క్షీరోదసంభవామ్ ॥ 3

అనుగ్రహపరాం బుద్ధిమ్ అనఘాం హరివల్లభామ్ ।
అశోకా మమృతాం దీప్తాం లోకశోక వినాశినీమ్ ॥ 4

నమామి ధర్మనిలయాం కరుణాం లోకమాతరమ్ ।
పద్మప్రియాం పద్మహస్తాం పద్మాక్షీం పద్మసున్దరీమ్ ॥ 5

పద్మోద్భవాం పద్మముఖీం పద్మనాభప్రియాం రమామ్ ।
పద్మమాలాధరాం దేవీం పద్మినీం పద్మగంధినీమ్ ॥ 6

పుణ్యగంధాం సుప్రసన్నాం ప్రసాదాభిముఖీం ప్రభామ్ ।
నమామి చన్ద్రవదనాం చన్ద్రాం చన్ద్రసహోదరీమ్ ॥ 7

చతుర్భుజాం చంద్రరూపామ్ ఇందిరామ్ ఇందుశీతలామ్ ।
ఆహ్లాదజననీం పుష్టిం శివాం శివకరీం సతీమ్ ॥ 8

విమలాం విశ్వ జననీం తుష్టిం దారిద్ర్యనాశిశమ్ ।
ప్రీతిపుష్కరిణీం శాంతాం శుక్లమాల్యాంబరాం శ్రియమ్ ॥ 9

భాస్కరీం బిల్వనిలయాం వరారోహాం యశస్వినీమ్ ।
వసుంధరామ్ ఉదారాంగాం హరిణీం హేమమాలినీమ్ ॥ 10

ధనధాన్యకరీం సిద్ధి స్త్రైణసౌమ్యాం శుభప్రదామ్ ।
నృపవేశ్మగతానందాం వరలక్ష్మీం వసుప్రదామ్ ॥ 11

శుభాం హిరణ్యప్రాకారాం సముద్రతనయాం జయామ్ ।
నమామి మంగళాం దేవీం విష్ణువక్షఃస్థలస్థితామ్ ॥ 12

విష్ణుపత్నీం ప్రసన్నాక్షీం నారాయణ సమాశ్రితామ్ ।
దారిద్ర్య ధ్వంసినీం దేవీం సర్వోపద్రవవారిణీమ్ ॥ 13

నవదుర్గాం మహాకాళీం బ్రహ్మవిష్ణుశివాత్మికామ్ ।
త్రికాలజ్ఞాన సంపన్నాం నమామి భువనేశ్వరీమ్ ॥ 14

లక్ష్మీం క్షీరసముద్రరాజతనయాం శ్రీరంగధామేశ్వరీం
దాసీభూత సమస్తదేవవనితాం లోకైకదీపాఙ్కురామ్ ।
శ్రీమన్మన్దకటాక్షలబ్ధవిభవ బ్రహ్మేంద్రగంగాధరాం
త్వాం త్రైలోక్యకుటుంబినీం సరసిజాం వందే ముకుందప్రియామ్ ।

మాత ర్నమామి కమలే! కమలాయతాక్షి !
శ్రీవిష్ణుహృత్కమలవాసిని! విశ్వమాతః !
క్షీరోదజే! కమలకోమల గర్భగౌరి!
లక్ష్మి! ప్రసీద సతతం నమతాం శరణ్యే ॥

ఫలశ్రుతిః

త్రికాలం యో జపేత్ విద్వాన్ షణ్మాసం విజితేన్ద్రియః ।
దారిద్ర్య ధ్వంసనం కృత్వా సర్వ మాప్నోత్యయత్నతః ॥

దేవీనామ సహస్రేషు పుణ్యమష్టోత్తరం శతమ్ ।
యేన శ్రియ మవాప్నోతి కోటిజన్మ దరిద్రతః ॥

భృగువారే శతం ధీమాన్ పఠేత్ వత్సరమాత్రకమ్ ।
అష్టైశ్వర్య మవాప్నోతి కుబేర ఇవ భూతలే ॥

దారిద్ర్యమోచనం నామ స్తోత్ర మంబాపరం శతమ్ ।
యేన శ్రియ మవాప్నోతి కోటిజన్మదరిద్రతః ॥

భుక్త్వాతు విపులాన్ భోగాన్ అన్తే సాయుజ్య మాప్నుయాత్ ।
ప్రాతఃకాలే పఠేత్ నిత్యం సర్వదుఃఖోపశాన్తయే ॥
పఠంస్తు చిన్తయేత్ దేవీం సర్వాభరణభూషితామ్ ॥

ఇతి శ్రీలక్ష్మ్యష్టోత్తర శతనామస్తోత్రం సంపూర్ణమ్

# చతుఃశ్లోకి



(నాల్గు శ్లోకాలను కల ఈ లక్ష్మీస్తుతిని శ్రీయామునాచార్యులవారు రచించారు. ఇందులో లక్ష్మీవైభవం తెలుపబడింది. ప్రతిదినం ఆరాధన చివరలో చెప్పుకోవడం మంచిది)

**కాంత స్తే పురుషోత్తమః ఫణిపతి శ్శయ్యాసనం వాహనం**
**వేదాత్మా విహగేశ్వరో యవనికా మాయా జగన్మోహినీ ।**
**బ్రహ్మేశాదిసురవ్రజ స్సదయిత స్త్వద్దాసదాసీగణః**
**శ్రీరిత్యేవ చ నామ తే భగవతి! బ్రూమః కథం త్వాం వయమ్ ॥ 1 ॥**

కల్యాణగుణాలను నిండుగా ఉన్నదానా! పురుషోత్తముడైన భగవానుడు నీకు ప్రియమైన పతి. సర్పరాజు అయిన ఆదిశేషుడు పడుక. వేదాన్ని శరీరంగా కలవాడు పక్షిరాజు అయిన గరుత్మంతుడు నీకు ఆసనంగాను, వాహనంగాను ఉన్నాడు. జగత్తును మోహింపజేసే ప్రకృతి నీముఖానికి తెరగా ఉన్నది. తమ భార్యతో కూడి ఉండే బ్రహ్మ, శివుడుమొదలైన దేవ సమూహం నీకు దాసగణంగా, దాసీగణంగా ఉన్నది. నీ పేరుకూడా **"శ్రీః"** అనియే. అటువంటి మహిమనుకల నిన్నుగూర్చి అజ్ఞులమైన మేము ఏవిధంగా చెప్పగలము?

**యస్యా స్తే మహిమాన మాత్మన ఇవ త్వద్వల్లభోఽపి ప్రభుః**
**నాలం మాతు మియత్తయా నిరవధిం నిత్యానుకూలం స్వతః ।**
**తాం త్వాం దాస ఇతి ప్రపన్న ఇతి చ స్తోష్యామ్యహం నిర్భయః**
**లోకైకేశ్వరి! లోకనాథదయితే! దాంతే! దయాం తే విదన్ ॥ 2 ॥**

లోకానికి ఈశ్వరిగా ఉన్నదానా! లోకాలకు అన్నిటికీ స్వామి అయిన భగవానునకు ప్రియమహిషి అయినదానా! కరుణాస్వరూపిణీ! అంతు లేనిది సహజం గానే భగవానునకు సదా అనుకూలంగా ఉన్నది అయిన నీ గొప్పతనాన్ని ఈశ్వరుడైన నీవల్లభుడు కూడా తన గొప్పతనాన్ని వలె ఇంతటిది అని పరిచ్ఛేదించలేదు. అటువంటి నిన్ను దాసుడను, శరణు పొందినవాడను. నీ కరుణను తెలిసే నేను భయం లేనివాడనై స్తుతిస్తాను.

**ఈషత్ త్వత్కరుణా నిరీక్షణసుధాసంధుక్షణా ద్రక్ష్యతే**
**నష్టం ప్రాక్ స్తదలాభత స్త్రిభువనం సంప్రత్యనంతోదయమ్ ।**
**శ్రేయో న హ్యరవిందలోచనమనఃకాంతాప్రసాదాదృతే**
**సంసృత్యక్షరవైష్ణవాధ్వసు నృణాం సంభావ్యతే కర్హిచిత్ ॥ 3 ॥**

నీ కటాక్షం పొందనందువల్ల పూర్వం నశించి పోయిన ముల్లోకాలు ఇపుడు, కొంచెం నీ కరుణాకటాక్షం అనే అమృతవర్షం కురవడంవల్ల అంతులేని గొప్పతనాన్ని కలిగి ఉండేటట్లుగా రక్షింపబడు తున్నది మానవులకు ఐశ్వర్య-కైవల్య-పరమపదాలలో శ్రేయస్సు, పుండరీకాక్షుని మనస్సుకు ప్రియురాలవు అయిన నీయొక్క అనుగ్రహం లేకుండా ఏనాడూ కలుగదుకదా!

**శాంతానందమహావిభూతి పరమం యద్బ్రహ్మ రూపం హరేః**
**మూర్తం బ్రహ్మ తతోఽపి తత్ప్రియతరం రూపం యదత్యద్భుతమ్ ।**
**యాన్యన్యాని యథాసుఖం విహరతో రూపాణి సర్వాణి తాని**
**ఆహుః స్వై రనురూపరూపవిభవైః గాఢోపగూఢాని తే ॥ 4 ॥**

షడూర్ములను లేనిదై, ఆనందమయమై, గొప్ప విభూతులను కల్గినదై, తనకంటె గొప్పది వేఱొకటి లేనిదై, పెద్దదై ఉన్నందున, (ఇతరులను) పెద్దదిగా చేసినందువల్ల బ్రహ్మశబ్దంచే చెప్పదగినదై ఉండే హరియొక్క ఏ స్వరూపం ఉన్నదో, దానికంటె ఆ భగవానునకు చాలా ప్రియంగా ఉండేది, కంటితో దర్శించదగినది, బ్రహ్మశబ్దంచే వ్యవహరింపబడేది, మిక్కిలి అద్భుతం అయినది అయిన ఏ రూపం ఉన్నదో, ఇష్టం వచ్చినట్లు విహరించే భగవానునకు మిగిలిన ఏ రూపాలు, ఉన్నవో ఆ స్వరూపరూపాలన్నీ నీకు అసాధారణాలై, తగినవై ఉండే దివ్యరూపాలతో గాఢంగా కలసి ఉన్నవి – అని ప్రమాణాలు చెబుతున్నవి.

# పరాంకుశాష్టకమ్

(ఇది నమ్మాళ్వార్ల స్తుతి. దీనిని ఆరాధన చివరలో చెప్పుకోవడం మంచిది)

1. **త్రైవిద్యవృద్ధజనమూర్ధ విభూషణం యత్**
**సంపచ్చ సాత్త్వికజనస్య యదేవ నిత్యమ్ ।**
**యద్వా శరణ్య మశరణ్యజనస్య పుణ్యం**
**తత్ సంశ్రయేమ వకుళాభరణాంఘ్రియుగ్మమ్ ॥**

వేదార్థాలను తెలిసినవారిలో ప్రముఖులైనవారి శిరస్సులకు ఆభరణం, సాత్త్వికజనులకు నిత్యమైన సంపద, ఏ గతి లేనివారికి గొప్ప గతి, పరమపవిత్రమైన నమ్మాళ్వార్ల శ్రీచరణాలను రెండిటిని ఆశ్రయిస్తున్నాను.



2. **భక్తిప్రభావ భవదద్భుతభావబంధ–**
**సంధుక్షిత ప్రణయసార రసౌఘపూరః ।**
**వేదార్థరత్ననిధి రచ్యుతదివ్యధామ**
**జీయాత్ పరాంకుశపయోధి రసీమభూమా ॥**

ఆళ్వార్లు ఒక గొప్ప సముద్రం. ఆళ్వార్లకు కల్గిన స్త్రీభావన (సఖి–మాతృ–నాయకీభావనలు) భగవద్భక్తి ప్రభావంవల్ల కల్గినవి. ఆశ్చర్యాన్ని కల్గించే ఆ భావబంధాల అతిశయంవల్ల పుట్టిన ప్రణయభావమనే (అమృత) ప్రవాహంతో ఆళ్వార్లు అనే సముద్రం నిండి ఉన్నది. ఆళ్వార్లు అనే సముద్రంలో వేదార్థాలనే రత్నాలున్నాయి. ఆళ్వార్లు అనే ఈ సముద్రంలో కూడా అచ్యుతుడనబడే భగవానుడు నివసిస్తున్నాడు. ఈ ఆళ్వార్లు అనబడే సముద్రంకూడా గొప్ప మహిమను కల్గినది. ఇటువంటి ఆళ్వార్లు అనే సముద్రం నిత్యం వర్ధిల్లాలి.

3. **ఋషిం జుషామహే కృష్ణతృష్ణాతత్త్వ మివోదితమ్ ।**
**సహస్రశాఖాం యోఽద్రాక్షీత్ ద్రావిడీం బ్రహ్మసంహితామ్ ॥**

ఆళ్వార్లకు శ్రీకృష్ణునిపై గల తృష్ణ, లేక, లోకసంరక్షణలో శ్రీకృష్ణునకు కల తృష్ణ– మూర్తీభవించినట్లున్నవారు, వేయి శాఖలను కల (సామవేదంతో సమానమైన) తిరువాయ్మొళ్ళి అనే ద్రావిడవేదాన్ని దర్శించినవారు, మహర్షి అయిన నమ్మాళ్వార్లను ప్రీతితో సేవిస్తాము.

4. **యద్గోసహస్ర మపహంతి తమాంసి పుంసాం**
**నారాయణో వసతి యత్ర సశంఖచక్రః ।**
**యన్మండలం శ్రుతిగతం ప్రణమంతి విప్రాః**
**తస్మై నమో వకుళభూషణభాస్కరాయ ॥**

నమ్మాళ్వార్లు సూర్యునివంటివారు. సూర్యుడు వేయి కిరణాలను లోకంలో వ్యాపింపజేసి చీకటిని పోగొట్టేటట్లే, ఆళ్వార్లు (తిరువాయ్మొళ్ళి – అనే ప్రబంధంలోని) వేయి పాశురాలనే కిరణాలను లోకంలో వ్యాపింపజేసి, లోకుల అజ్ఞానమనే చీకటిని పోగొడుతున్నారు. సముద్రంలో శంఖచక్రధారి అయిన శ్రీమన్నారాయణుడు నిత్యవాసం చేసేటట్లే, నమ్మాళ్వార్ల హృదయంలో కూడా శ్రీమన్నారాయణుడు శంఖచక్రధారియై వేంచేసి ఉన్నాడు. సూర్యమండలాన్ని దర్శించిన విప్రులు (బ్రాహ్మణులు) చేతులెత్తి నమస్కరించినట్లే, నమ్మాళ్వార్లు అవతరించిన మండలాన్ని (కురుకాపురిని) విన్నపుడు,

లేక, వారు పల్కిన మండల (అన్దాది) ప్రబంధమైన తిరువాయ్‌మొ౹ౙిని విన్నపుడు విజ్ఞులు చేతులెత్తి నమస్కరిస్తారు. అటువంటి గొప్ప సముద్రంవలె ఉండే నమ్మా౹ౙ్వార్లకు నమస్కారం.

5. **పత్యుః శ్రియః ప్రసాదేన ప్రాప్తసార్వజ్ఞ్య సంపదమ్ ।**
**ప్రపన్నజనకూటస్థం ప్రపద్యే శ్రీపరాంకుశమ్ ॥**

శ్రియఃపతి అనుగ్రహంవల్ల సర్వజ్ఞత్వం – (అన్నిటినీ తెలిసికోవడం) అనే సంపదను పొందినవారు, ప్రపన్నులకులానికి మూలపురుషులైన శ్రీపరాంకుశమునిని (నమ్మా౹ౙ్వార్లను) శరణాగతి చేస్తున్నాను.

6. **శఠకోపమునిం వందే శఠానాం బుద్ధిదూషకమ్ ।**
**అజ్ఞానాం జ్ఞానజనకం తింత్రిణీమూలసంశ్రయమ్ ॥**

స్వరూపజ్ఞానం లేని, కుటిలబుద్ధిని కలవారి అజ్ఞానాన్ని పోగొట్టేవారు, జ్ఞానం లేనివారికి యథార్థజ్ఞానాన్ని కల్గించేవారు, ఏనాడూ నిద్రించని చింతచెట్టు మూలంలో నివసించేవారైన శఠకోపమునికి నమస్కరిస్తున్నాను.

7. **వకుళాభరణం వందే జగదాభరణం మునిమ్ ।**
**యః శ్రుతే రుత్తరం భాగం చక్రే ద్రావిడభాషయా ॥**

లోకానికి అద్వితీయమైన ఆభరణంవంటివారు, లోకహితాన్నిగూర్చి సదా ఆలోచించేవారు, వేదాంతార్థాలను ద్రావిడభాషలో (ద్రావిడప్రబంధాల రూపంలో) రచించినవారైన నమ్మా౹ౙ్వార్లకు నమస్కరిస్తున్నాను.

8. **వకుళాలంకృతం శ్రీమచ్ఛఠకోపపదద్వయమ్ ।**
**అస్మత్కులధనం భోగ్యమస్తు మే మూర్ధ్ని భూషణమ్ ॥**

వకుళపుష్పాలచే (పొగడపూలచే) అలంకరింపబడినది, గొప్పగా ప్రకాశిస్తున్నది, మా కులానికి ధనం, పరమభోగ్యమైనది అయిన నమ్మా౹ౙ్వార్ల పాదద్వయం నా శిరస్సుకు ఆభరణంగా కావాలి.

9. **నమజ్జనస్య చిత్తభిత్తిభక్తి చిత్రతూలికా**
**భవాహివీర్యభంజనే నరేంద్రమంత్రయంత్రణా ।**
**ప్రపన్నలోకకైరవ ప్రపన్నచారుచంద్రికా**



**శఠారిహస్తముద్రికా హఠాద్ధునోదు మే తమః ॥**

తమకు నమస్కరించేవారి మనస్సులలో భక్తి అనే చిత్రాన్ని లిఖించే చిత్రలేఖిని వంటిది, సంసారమనే సర్పంయొక్క విషాన్ని పోగొట్టడంకోసం విషవైద్యుడు చేసే మంత్రప్రయోగయంత్రం వంటిది, ప్రపన్నుల మనస్సులకు ఆనందాన్ని కల్గించే అందమైన చంద్రికవంటిది అయిన నమ్మా౹ౙ్వార్ల ఉపదేశముద్ర నా అజ్ఞానాన్ని తొలగించాలి.

## శ్రీమదాన్ధ్రపూర్ణ విరచితం
## శ్రీరామానుజాష్టోత్తర శతనామ స్తోత్రమ్

**రామానుజః పుష్కరాక్షో యతీన్ద్రః కరుణాకరః ।**
**కాన్తిమత్యాత్మజః శ్రీమాన్ లీలామానుషవిగ్రహః ॥**

**సర్వశాస్త్రార్థతత్త్వజ్ఞ స్సర్వజ్ఞ స్సజ్జనప్రియః ।**
**నారాయణ కృపాపాత్రం శ్రీభూతపురనాయకః ॥**

**అనఘో భక్తమన్దారః కేశవానంద వర్ధనః ।**
**కాఞ్చీపూర్ణప్రియకరః ప్రణతార్తివినాశనః ॥**

**పుణ్యసఙ్కీర్తనః పుణ్యో బ్రహ్మరాక్షసమోచకః ।**
**యాదవాపాదితాపార్థ వృక్షచ్ఛేదకుఠారకః ॥**

**అమోఘో లక్ష్మణముని శ్శారదాశోకనాశనః ।**
**నిరన్తరనాజ్ఞాన నిర్మోచన విచక్షణః ॥**

**వేదాన్త ద్వయసారజ్ఞో వరదాయామ్బుదాయకః ।**
**పరేఙ్గితజ్ఞో నీతిజ్ఞో యామునాఙ్గుళిమోచకః ॥**

**దేవరాజకృపాలబ్ధషడ్వాక్యార్థ మహోదధిః ।**
**పూర్ణార్యలబ్ధసన్మన్త్ర శ్శౌరిపాదాబ్జషట్పదః ॥**

త్రిదణ్డధారీ బ్రహ్మజ్ఞో బ్రహ్మధ్యానపరాయణః ।
రంగేశకైఙ్కర్యరతో విభూతిద్వయనాయకః ॥

గోష్ఠీపూర్ణకృపాలబ్ధమన్త్రరాజప్రకాశకః ।
వరరఙ్గానుకమ్పాత్త ద్రావిడామ్నాయపారగః ॥

మాలాధరార్యసుజ్ఞాత ద్రావిడామ్నాయతత్త్వధీః ।
చతుస్సప్తతిశిష్యాఢ్యః పఞ్చాచార్య సమాశ్రయః ॥

ప్రపీతవిషతీర్థామ్బుః ప్రకటీకృత వైభవః ।
ప్రణతార్తిహరాచార్య దత్తభిక్షైకభోజనః ॥

పవిత్రీకృతకూరేశో భాగినేయత్రిదణ్డకః ।
కూరేశదాశరథ్యాదిచరమార్థ ప్రదాయకః ॥

రంగేశ వేఙ్కటేశాది ప్రకటీకృత వైభవః ।
దేవరాజార్చనరతో మూకముక్తి ప్రదాయకః ॥

యజ్ఞమూర్తిప్రతిష్ఠాతా మన్నాథో ధరణీధరః ।
వరదాచార్య సద్భక్తో యజ్ఞేశార్తి వినాశకః ॥

అనన్తాభీష్టఫలదో విట్ఠలేంద్ర ప్రపూజితః ।
శ్రీశైలపూర్ణ కరుణాలబ్ధ రామాయణార్థకః ॥

ప్రపత్తిధర్మైకరతో గోవిన్దార్య ప్రియానుజః ।
వ్యాససూత్రార్థతత్త్వజ్ఞో బోధాయనమతానుగః ॥

శ్రీభాష్యాది మహాగ్రంథకారకః కలినాశనః ।
అద్వైతమతవిచ్ఛేత్తా విశిష్టాద్వైత పాలకః ॥

కురంగనగరీపూర్ణమన్త్ర రత్నోపదేశకః ।
వినాశితాఖిలమత శ్శేషీ కృతరమాపతిః ॥

పుత్రీకృతశఠారాతి శ్శఠజిత్సూక్తివర్ధనః ।
భాషాదత్తహయగ్రీవో భాష్యకారో మహాయశాః ॥



పవిత్రీకృతభూభాగః కూర్మనాథప్రకాశకః ।
శ్రీవేఙ్కటాచలాధీశ శంఖచక్రప్రదాయకః ॥

శ్రీవేఙ్కటేశశ్వశుర శ్శ్రీరమాసఖదేశికః ।
కృపామాత్రప్రపన్నార్యో గోపికామోక్షదాయకః ॥

సమీచీనార్యసచ్ఛిష్య సత్కృతో వైష్ణవ ప్రియః ।
క్రిమికంఠనృపధ్వంసీ సర్వమన్త్రమహోదధిః ॥

అఙ్గీకృతాంధ్ర పూర్ణాఖ్య స్సాలగ్రామప్రతిష్ఠితః ।
శ్రీభక్తగ్రామపూర్ణేశో విష్ణువర్ధనరక్షకః ॥

బౌద్ధధ్వాన్త సహస్రాంశు శ్శేషరూప ప్రదర్శకః ।
నగరీకృతవేదాద్రిః దిల్లీశ్వర సమర్చితః ॥

నారాయణ ప్రతిష్ఠాతా సమ్పత్పుత్రవిమోచకః ।
సనత్కుమారజనక స్సాధులోకశిఖామణిః ॥

సుప్రతిష్ఠితగోవిన్దరాజః పూర్ణమనోరథః ।
గోదాగ్రజో దిగ్విజేతా గోదాభీష్టప్రపూరకః ॥

సర్వసంశయవిచ్ఛేత్తా విష్ణులోక ప్రదాయకః ।
అవ్యాహతమహద్వర్త్మా యతిరాజో జగద్గురుః ॥

ఏవం రామానుజార్యస్య నామ్నామష్టోత్తరం శతమ్ ।
యః పఠేచ్ఛృణుయాద్వాపి సర్వాన్కామా నవాప్నుయాత్ ॥

యదాన్ధ్రపూర్ణేన మహాత్మనేదం స్తోత్రం కృతం సర్వజనావనాయ ।
తజ్జీవభూతం భువి వైష్ణవానాం బభూవ రామానుజమానసానామ్ ॥

శ్రీమదాన్ధ్రపూర్ణ విరచితం శ్రీరామానుజాష్టోత్తర
శతనామస్తోత్రం సమాప్తమ్

# శ్రీమణవాళమహామునులు అనుగ్రహించిన

# యతిరాజవింశతి

**యః స్తుతిం యతిపతిప్రసాదనీం వ్యాజహార యతిరాజవింశతిమ్ ।**
**తం ప్రపన్నజన చాతకామ్బుదం నౌమి సౌమ్యవరయోగి పుఙ్గవమ్ ॥**

ఏ శ్రీవరవరమునులు భగవద్రామానుజులకు ఆనందాన్ని కల్గించే యతిరాజ వింశతిని పలికారో, ప్రపన్నజనులనే చాతకపక్షులకు మేఘంవలె సంతోషాన్ని కల్గించే ఆ శ్రీవరవరమునులకు నమస్కరిస్తున్నాను.

1. **శ్రీమాధవాఙ్ఘ్రి జలజద్వయ నిత్యసేవా**
**ప్రేమావిలాశయ పరాఙ్కుశ పాదభక్తమ్ ।**
**కామాదిదోషహర మాత్మపదాశ్రితానాం**
**రామానుజం యతిపతిం ప్రణమామి మూర్ధ్నా ॥**

శ్రియఃపతి పాదపద్మాల జంటను నిత్యం సేవించడంలోని ప్రేమచేత వ్యాకులమైన బుద్ధిని కల నమ్మాళ్వార్ల శ్రీచరణాలపట్ల భక్తిని కల్గినవారు, తమ పాదాలను ఆశ్రయించినవారి కామాదిదోషాలను పోగొట్టేవారు, యతిరాజులు అయిన శ్రీరామానుజులను శిరసా నమస్కరిస్తున్నాను.

2. **శ్రీరఙ్గరాజ చరణామ్బుజ రాజహంసం**
**శ్రీమత్పరాఙ్కుశ పదామ్బుజ భృఙ్గరాజమ్।**
**శ్రీభట్టనాథ పరకాల ముఖాబ్జమిత్రం**
**శ్రీవత్సచిహ్నశరణం యతిరాజమీడే ॥**

శ్రీరంగనాథుని పాదపద్మాలలో రాజహంసవంటివారు, కైంకర్యలక్ష్మిని కల నమ్మాళ్వార్ల శ్రీచరణపద్మాలలో వాలే గొప్ప తుమ్మెదవంటివారు, పెరియాళ్వార్లు, తిరుమంగైమన్నన్ మొదలైన ఆళ్వార్ల ముఖాలనే పద్మాలను వికసింపజేసే సూర్యుని వంటివారైన యతిరాజులను స్తుతిస్తున్నాను.

3. **వాచా యతీన్ద్ర! మనసా వపుషా చ యుష్మత్**
**పాదారవిన్దయుగళం భజతాం గురూణామ్।**
**కూరాధినాథ కురుకేశ ముఖాద్యపుంసాం**
**పాదానుచిన్తనపర స్సతతం భవేయమ్ ॥**



ఓ యతీంద్రా! మనస్సుతో, వాక్కుతో, శరీరంతో నీ పాదపద్మాల జంటను సేవించే మహనీయులైన కూరేశుల, తిరుక్కురుకైప్పిరాన్ పిళ్ళాన్ (కురుకేశులు) మొదలైన పూర్వాచార్యుల శ్రీపాదాలనుగూర్చి చింతించడంలో ఆసక్తిని కలవాడనుగా నేను ఎల్లప్పుడు కావాలి.

4. **నిత్యం యతీన్ద్ర! తవ దివ్యవపుస్స్మృతౌ మే**
**సక్తం మనో భవతు వాగ్గుణకీర్తనేసౌ ।**
**కృత్యం చ దాస్యకరణం తు కరద్వయస్య**
**వృత్త్యన్తరేస్తు విముఖం కరణత్రయం చ ॥**

యతీంద్రా! నా మనస్సు నీ దివ్యశరీరాన్ని ధ్యానించడంలో నిత్యం ఆసక్తం కావాలి. నా వాక్కు మీ గుణాలను కీర్తించడంలో ఆసక్తం కావాలి. నా రెండు చేతులు మీ కైంకర్యాన్ని చేసేవిగా కావాలి. నా మూడు కరణాలు ఇతర వ్యాపారాలలో వైముఖ్యాన్ని పొందాలి.

5. **అష్టాక్షరాఖ్య మనురాజ పదత్రయార్థనిష్ఠాం**
**మమాత్ర వితరాద్య యతీన్ద్ర! నాథ! ।**
**శిష్టాగ్రగణ్య జనసేవ్య భవత్పదాబ్జే**
**హృష్టాస్తు నిత్యమనుభూయ మమాస్య బుద్ధిః ॥**

యతీంద్రా! ఈ సంసారంలో ఈ కలికాలంలో అలమటించే నాకు, అష్టాక్షరి అనబడే మంత్రరాజంలోని ప్రణవం, నమస్సు, నారాయణాయ – అనబడే మూడు పదాల అర్థంలో నిష్ఠను ప్రసాదించాలి. శిష్టాగ్రేసరులైన జనులచే సేవించదగిన నీ శ్రీచరణపద్మాలను సదా అనుభవించి, ఈ నా బుద్ధి సంతోషపడినదిగా కావాలి.

6. **అల్పాపి మే న భవదీయ పదాబ్జభక్తిః**
**శబ్దాదిభోగరుచి రన్వహ మేధతే హా ! ।**
**మత్పాపమేవ హి నిదాన మముష్య నాన్యత్**
**తద్వారయార్య! యతిరాజ! దయైకసిన్ధో! ॥**

దయాసింధూ! ఆర్యా! శ్రీరామానుజా! నీ శ్రీచరణాలపట్ల భక్తి కొంచెం కూడా నాకు లేదు. శబ్దాది లౌకికవిషయాలను అనుభవించడంలోని ఆసక్తిమాత్రం ఎక్కువగా వృద్ధి అవుతున్నది. అయ్యో! దీనికి నా పాపమే కారణం తప్ప ఇంకొకటి కాదు. అందువల్ల ఆ నా పాపాలను పోగొట్టండి.

**7. వృత్త్యా పశు ర్నరవపుస్త్వహ మీదృశోపి**
**శ్రుత్యాదిసిద్ధ నిఖిలాత్మ గుణాశ్రయో యమ్।**
**ఇత్యాదరేణ కృతినోపి మిథః ప్రవక్తుమ్**
**అద్యాపి వఞ్చనపరోత్ర యతీన్ద్ర! వర్తే ॥**

యతీంద్రా! వంచనపరుడనైన నేనను మానవరూపాన్ని కలవాడను. వ్యాపారంలో (క్రియలో)మాత్రం పశుప్రాయుడను. ఇటువంటివాడను అయినా "వేదం మొదలైనవాటిచే ప్రతిపాదింపబడ్డ అన్ని ఆత్మగుణాలకు ఆశ్రయమైనవాడు ఇతడు" అని ఆదరంగా విద్వాంసులు పరస్పరం గొప్పగా చెప్పుకోవాలని ఈ శ్రీరంగంలో ఉంటున్నాను.

**8. దుఃఖావహోహ మనిశం తవ దుష్టచేష్ట**
**శబ్దాదిభోగనిరత శ్శరణాగతాఖ్యః।**
**త్వత్పాదభక్త ఇవ శిష్టజనౌఘమధ్యే**
**మిథ్యా చరామి యతిరాజ తతోస్మి మూర్ఖః ॥**

యతిరాజా ! శరణాగతుడననే పేరును కలవాడనై, శబ్దాదిలౌకికభోగాలలో ఆసక్తిని కలవాడనై, మీకు దుఃఖాన్ని కలుగజేసే నేను మీ శ్రీచరణపద్మాలలో భక్తిని కలవానివలె, శిష్టజనుల మధ్యలో మిథ్యగా ప్రవర్తిస్తున్నాను. అందువల్ల నేను మూర్ఖుణ్ణి అవుతున్నాను.

**9. నిత్యం త్వహం పరిభవామి గురుం చ మన్త్రం**
**తద్దేవతామపి న కించిదహో! బిభేమి ।**
**ఇత్థం శఠోప్యశఠవద్భవదీయసఙ్ఘే**
**హృష్టశ్చరామి యతిరాజ తతోస్మి మూర్ఖః ॥**

ఓ యతిరాజా! నేను ఆచార్యుని, మంత్రాన్ని, ఆ మంత్రాధిదేవతను ఎల్లప్పుడు అవమానిస్తున్నాను. అందుకు కొంచెంకూడా భయపడడంలేదు. ఎంత ఆశ్చర్యం! ఈ విధంగా గూఢంగా అకార్యాన్ని చేసే శఠుడను అయినా, ఆ విధంగా శఠుడు కానివానివలె నీ భక్తుల సంఘంలో సంతోషించేవాడనై ప్రవర్తిస్తున్నాను. అందువల్ల నేను మూర్ఖుణ్ణి.

**10. హా! హన్త ! హన్త! మనసా క్రియయా చ వాచా**
**యోహం చరామి సతతం త్రివిధాపచారాన్ ।**
**సోహం తవాప్రియకృత్ ప్రియకృద్వదేవ**
**కాలం నయామి యతిరాజ ! తతోస్మి మూర్ఖః ॥**



యతిరాజా! నేను మనస్సుతో, క్రియలతో, వాక్కుతో మూడు విధాలైన అపచారాలను (భగవదపచార – భాగవతాపచార – అసహ్యాపచారాలను) ఎల్లప్పుడు చేస్తున్నాను. ఇటువంటి నేను నీకు అప్రియాన్ని కల్గిస్తూ, ప్రియాన్ని కల్గించేవానివలె కాలాన్ని గడుపుతున్నాను. ఆహా ! ఈ కారణంవల్ల నేను మూర్ఖుణ్ణి.

**11. పాపే కృతే యది భవన్తి భయానుతాప**
**లజ్జాః పునః కరణమస్య కథం ఘటేత ।**
**మోహేన మే న భవతీహ భయాదిలేశః**
**తస్మాత్పునః పునరఘం యతిరాజ! కుర్వే ॥**

యతిరాజా! ఏదయినా పాపం చేసినపుడు భయం, పశ్చాత్తాపం, లజ్జ – అనే మూడు కల్గితే, మళ్లీ ఆ పాపాన్ని తిరిగి చేయడం జరుగదు. కాని, నేను పాపాలను చేసినా, భయం మొదలైన మూడు కొంచెంకూడా నాకు కల్గవు. అందువల్ల పాపాలను మళ్ళీ మళ్ళీ చేస్తున్నాను.

**12. అన్తర్బహి స్సకలవస్తుషు సన్తమీశమ్**
**అన్ధః పురః స్థితమివాహ మవీక్షమాణః ।**
**కందర్పవశ్యహృదయః సతతం భవామి**
**హన్త! త్వదగ్ర గమనస్య యతీంద్ర! నార్హః ॥**

యతీంద్రా! నేను అన్ని పదార్థాల లోపల బయట వ్యాపించి ఉండే భగవానుని, ఎదుట ఉండే వస్తువులను కానలేని గుడ్డివానిలె చూడనివాడనై, మన్మథునకు వశమైన హృదయం కలవాడనై సదా ఉన్నాను. అందువల్ల మీ ఎదుటకు రావడానికి కూడా తగను.

**13. తాపత్రయీ జనితదుఃఖనిపాతినోపి**
**దేహస్థితౌ మమ రుచిస్తు న తన్నివృత్తౌ ।**
**ఏతస్య కారణమహో! మమ పాపమేవ**
**నాథ! త్వమేవ హర తద్యతిరాజ ! శీఘ్రమ్॥**

నాథా! యతిరాజా! నాకు దేహస్థితి (రక్షణ)లోనే ఆసక్తి కల్గుతున్నది తప్ప, ఆధ్యాత్మిక – ఆధిభౌతిక – ఆధిదైవికాలనే మూడు తాపాలవల్ల కలిగే దుఃఖాలలో పడి ఉన్న ఆ దేహాన్ని పోగొట్టుకోవడంలో ఆసక్తి లేదు. దీనికి కారణం నా పాపమే. అయ్యో! మీరే ఆ పాపాలను తీర్చాలి.

**14. వాచామగోచర మహాగుణ దేశికాగ్ర్య -**
**కూరాధినాథ కథితాఖిల నైచ్యపాత్రమ్ ।**
**ఏషోహమేవ న పునర్జగతీదృశస్తత్**
**రామానుజార్య! కరుణైవతు మద్గతిస్తే ॥**

శ్రీరామానుజాచార్యా! వాచామగోచరాలైన గొప్ప గుణాలను కల్గిన ఆచార్యశ్రేష్ఠులైన కూరేశులచేత అనుసంధింపబడిన అన్ని నైచ్యాలకు నేనే పాత్రం. నావంటివాడు ఈ లోకంలో లేడు. అందువల్ల నీ దయమాత్రమే నాకు గతి.

**15. శుద్ధాత్మయామున గూరూత్తమ కూరనాథ**
**భట్టాఖ్య దేశికవరోక్త సమస్తనైచ్యమ్ ।**
**అద్యాప్యసంకుచితమేవ మయీహ లోకే**
**తస్మాద్యతీంద్ర! కరుణైవ తు మద్గతిస్తే॥**

యతీంద్రా! మహాత్ములైన శ్రీయామునులు, శ్రేష్ఠులైన కూరేశులు, పరాశరభట్టర్ అనే గొప్ప ఆచార్యులచే చెప్పబడిన అన్ని నైచ్యాలు అన్నీ ఈలోకంలో ఇపుడు ఏ లోటు లేకుండా నాలోనే ఉన్నాయి. అందువల్ల నాకు నీ దయ ఒక్కటే రక్షకం.

**16. శబ్దాదిభోగవిషయా రుచిరస్మదీయా**
**నష్టా భవత్విహ భవద్దయయా యతీన్ద్ర ! ।**
**త్వద్దాసదాసగణనా చరమావధౌ యః**
**తద్దాసతైకరసతా విరతామమాస్తు ॥**

యతీంద్రా! ఇక్కడ నాకు సంబంధించిన లౌకికవిషయభోగాసక్తి నీదయవల్ల నశించినది కావాలి. ఎవడు నీ దాసులయొక్క దాసుల చరమావధిలో ఉన్నాడో, అటువంటివాని కైంకర్యంలోనే ఆసక్తిని కల్గిఉండడం నాకు నిత్యంగా ఉండాలి.

**17. శ్రుత్యగ్రవేద్య నిజదివ్య గుణస్వరూపః**
**ప్రత్యక్షతా ముపగత స్త్విహ రఙ్గరాజః ।**
**వశ్య స్సదా భవతి తే యతిరాజ! తస్మాత్**
**శక్తః స్వకీయజన పాపవిమోచనే త్వమ్ ॥**

యతిరాజా! వేదాంతాలద్వారా తెలియదగిన దివ్యగుణాలను, స్వరూపాన్ని కల్గినవాడు, శ్రీరంగంలో అందఱి నేత్రాలకు గోచరుడై, సులభుడై ఉండే శ్రీరంగనాథుడు మీకు అధీనుడు. అందువల్ల మీరు మీ భక్తుల పాపాలను పోగొట్టడంలో సమర్థులు.



**18. కాలత్రయేపి కరణత్రయ నిర్మితాతి**
**పాపక్రియస్య శరణం భగవత్క్షమైవ ।**
**సా చ త్వయైవ కమలారమణేర్థితా యత్**
**క్షేమ స్స ఏవ హి యతీన్ద్ర! భవచ్ఛ్రితానామ్॥**

యతీంద్రా! మూడు కాలాలలోను కరణత్రయాలచే చేయబడిన అతిపాప కృత్యాలను కల్గినవానికి రక్షకం భగవానుని క్షమాగుణం మాత్రమే. అది మీచేతనే భగవానుని సన్నిధిలో ప్రార్థింపబడినదనే విషయం మిమ్ములను ఆశ్రయించినవారికి అందఱికి క్షేమకరం.

**19. శ్రీమన్ ! యతీన్ద్ర ! తవ దివ్యపదాబ్జసేవాం**
**శ్రీశైలనాథ కరుణా పరిణామదత్తామ్ ।**
**తా మన్వహం మమ వివర్ధయ నాథ ! తస్యాః**
**కామం విరుద్ధ మఖిలం చ నివర్తయ త్వమ్ ॥**

కైంకర్యలక్ష్మిని కల్గిన ఓ యతీంద్రా! నాకు తిరువాయ్‌మొழிప్పిళ్ళై అనబడే నా ఆచార్యుల దయయొక్క పరిపాకంచే అనుగ్రహింపబడ్డ దివ్యమైన నీ శ్రీచరణసేవను ఎల్లప్పుడు నీవు వృద్ధిజేయాలి. నాథా! దీనికంటే విరుద్ధమైన సమస్తాన్ని నివర్తింపజేయాలి.

**20. విజ్ఞాపనం యదిద మద్య తు మామకీనమ్**
**అఙ్గీకురుష్వ యతిరాజ ! దయామ్బురాశే !।**
**అజ్ఞోయ మాత్మగుణలేశ వివర్జితశ్చ**
**తస్మాదనన్యశరణో భవతీతి మత్వా ॥**

దయాసముద్రా ! యతిరాజా ! నాకు చెందిన ఈ విజ్ఞాపనాన్ని "వీడు అజ్ఞుడు, ఆత్మగుణాలు లేశం కూడా లేనివాడు, అందువల్ల అనన్యశరణ్యుడు" అని తలచి నన్ను అంగీకరించు.

**21. ఇతి యతికులధుర్య మేధమానైః**
**శ్రుతిమధురై రుదితైః ప్రహర్షయన్తమ్ ।**
**వరవరముని మేవ చిన్తయన్తీ**
**మతిరియ మేతి నిరత్యయం ప్రసాదమ్ ॥**

ఈ విధంగా యతీశ్వరులైన శ్రీరామానుజులను నిత్యాభివృద్ధాలైన, శ్రుతి మధురాలైన (వాక్కులతో) నేస్తోత్రాలతో సంతోషింపజేసే శ్రీవరవరమునులనే ధ్యానించే నా ఈ బుద్ధి అంతు లేని ప్రసాదాన్ని పొందుతున్నది.

యతిరాజవింశతి సంపూర్ణం.

# భజయతిరాజస్తోత్ర సారాంశము

ఈ గ్రంథమును రచించినవారు కర్ణాటకరాష్ట్రములోని తిరునారాయణపుర సమీపమునగల సాలగ్రామక్షేత్రమున జన్మించిన, కౌండిన్యగోత్రులైన రంగనాథాచార్యుల వారు. వీరు, భగవద్రామానుజుల ప్రధానశిష్యులలో ఒకరైన ఆంధ్రపూర్ణుల వంశమునకు చెందినవారనుట ఈ స్తుతి చివరిశ్లోకమును బట్టి అభ్యూహించవచ్చును. ఆంధ్రపూర్ణులకు సంప్రదాయమున “వడుగనంబి – అని పేరు. ఈ వడుగనంబి తమ ఆచార్యులైన శ్రీరామానుజులే సర్వస్వమని నమ్మిన చరమోపాయనిష్ఠులు. అందువల్ల వీరికి శ్రీరామానుజుల మధురకవులను ప్రసిద్ధిని పొందిరి. శ్రీరామానుజుల చరిత్రను తెలుపు యతిరాజవిజయమను పేర సంస్కృతశ్లోకాత్మకమైన మధురకృతిని, శ్రీరామానుజులు అష్టోత్తరశతనామస్తోత్రమును రచించిరి. వీరి వంశమున జన్మించిన ఈ రంగాచార్యుల వారు కూడా భగవద్రామానుజులే ఉత్తరాకాచార్యులు, వారిసేవే పరమార్థమను అవిచాల్యమైన విశ్వాసమును కల్గినవారగుటచే తాము నమ్మిన సిద్ధాంతమును భజయతి రాజస్తోత్రముద్వారా వ్యక్తీకరించిరి. దీనిని వీరు ఆత్మోపదేశాత్మకముగా రచించుట విశేషము. నమ్మాళ్వార్లు కూడా తిరువాయ్‌మొழி ప్రబంధమును ఆత్మోపదేశరూపముగానే కదా ఆరంభించిరి. ఈస్తుతిలో శ్రీరామానుజుల వైభవము సమగ్రముగా మనోహరమైన రీతిలో ప్రతిపాదింపబడినది. శ్రీరామానుజుల చరిత్రకు సంబంధించిన పలు ఐతిహ్యములు, సంఘటనలు ఇందు ప్రస్తావింపబడుటను గమనించవచ్చును. ఉదాహరణకు **“శ్రీరంగేశ జయాశ్రయకేతుః”** అను ప్రయోగము ద్వారా శ్రీరామానుజులు శ్రీరంగాలయ మున చేసిన పలు సంస్కరణలు, **“పద్మానేతుః ప్రణతౌ హేతుః”** అను ప్రయోగమును తిరుమల క్షేత్రములో అధివసించి ఉండు దైవము శ్రీనివాసుని రూపములోని శ్రీమన్నారాయణుడే అని నిరూపించిన సందర్భము సూచింపబడుట గమనించదగినవి.



**“పద్మానేతుః”** అనగా శ్రీనివాసుడేకదా! **“మూకాంధానపి మోక్షయితారమ్, యతిపతి పదజలకణికా సేకః.... తస్య పదేన హతోయమలోకః”** ఇత్యాదులు కూడ ఇటువంటివే.

ఈస్తుతి మాత్రాఛందస్సులో రచింపబడినది. ప్రతిచరణము 16 మాత్రలు కల్గియున్నది. గానానుకూలమైన గీతికారూపములోనిబద్ధమైన ఈకృతి శ్రీరామానుజ భక్తులకు సదాభోగ్యమైన అక్షరాత్మక కంఠాభరణం.

కేవలం గానమేకాక, ఆగానం అర్థానుసంధాన పూర్వకమైతే. శ్రోత్రానందంతో పాటు, మనస్సుకు కూడా ఆనందం కల్గుతుంది కదా! ప్రస్తుతము ప్రచురింపబడే అర్థతాత్పర్యసహితమైన గ్రంథం అటువంటి అనుభూతి భక్తులకు కల్గించగలదనే నమ్మకంతో ఈ ప్రయత్నం చేయబడినది. ఈ స్తోత్రంలో మొత్తం 36 శ్లోకాలున్నాయి. శ్రీవైష్ణవ సంప్రదాయంలో ఈ సంఖ్యకు చాలా ప్రాధాన్యం ఉన్నది. భగవద్విషయమనే పేరుతో ప్రసిద్ధి చెందిన, నమ్మిళ్ళై తిరువాయ్‌మొழி ప్రబంధానికి అనుగ్రహించిన వ్యాఖ్య 36 వేల గ్రంథపరిమితిని కల్గినది. శ్రీరామానుజులు బ్రహ్మసూత్రాలపై రచించిన వ్యాఖ్య అయిన శ్రీభాష్యానికి శ్రీసుదర్శనభట్టర్ రచించిన శ్రుతప్రకాశిక అనే వివరణం కూడా ముప్పై ఆఱువేల గ్రంథపరిమితిని ల్గినది. ఈ శ్రీరామానుజుల వైభవాన్ని తెలిపే ఈ కృతినికూడా 36 గీతాల పరిమితిని కల్గి ఉండడం విశేషం.

ఇందు కవి సాటి లేని ప్రభావాతిశయమును కల శ్రీరామానుజాచార్యులవారి వైభవమును మిక్కిలి నేర్పుతో శ్రోత్రపేయముగ వర్ణించిరి. మునుముందు మొదటి శ్లోకములోని యతిరాజుల భజనీయతను సమర్థించిరి. తరువాత వారి అవతారాది వైభవముల గొనియాడిరి. పిమ్మట వారి సేవాభాగ్య మబ్బిన సౌభాగ్యశాలుర పరితాప మంతట నంతరించునని యుపపాదించిరి. అయినచో నిట్టిదానిని ఎందులకంద రాచరించకుండ విడుచుచున్నారను శంకాపరిహారములను రెండు చరణములలో గావించిరి. రూపయౌవనగర్వితులై, కన్నుమిన్ను గానని గ్రామ్యసుఖాభిలాషులీ యతిరాజులను భజించరని బదులిచ్చిరి. పరిణతవిరసమగు పనసఫలము రీతిలో అసారముగ గోచరించు సంసారమున జీర్ణదేహులైనను, విషయసుఖాభిలాష అనుభవమున పెరుగునదియేగాని, తరుగునది గాకుండుటచే, దానిని వీడి ఈ మార్గమున వచ్చుట లేదని నిర్ణయించిరి. ఒకవేళ విషయతృష్ణ నిరతిశయసుఖమయముగ

గోచరించినను, అది హేయవిషయకమగుటచే పరిహరణీయమనియు, దాని నాదరించుచు నీయతిరాజులను భజించుట దుస్సాధమనిరి, సంసారజంఝూటన దైవవశమున అంతరించినను, సంపన్నులగు సంసారులకు దత్తపుత్ర సంతాప మినుమడించుచుండుటచే వారికీమార్గ మరుదనిరి. గర్భదరిద్రులైనచో వారికిట్టి అడ్డంకులు లేకున్నను, వారికి గల సహజమైన రాజసాహంకారమే వారికి ప్రతిబంధక మనుటను సమంజసముగ నుపపాదించిరి. ఈ యతిరాజులభజనవీడి సాధనాంతరముల నాదరించుట – ఎటువంటిదనగా, చేతనున్న చెండును వీడి చెట్టునున్న పూలను ఆశించుటవలె అవివేకమని నిర్ణయించిరి. తిరిగి రెండు చరణములద్వారా సంసారమునందుండు కష్టపరంపరలను తెలిపి, తదవలంబనమే సర్వానర్థమూలముగాన, వ్యర్థమైన ఆ శ్రమను వీడి యతిరాజుల నాశ్రయించుమని హెచ్చరించిరి. కొడుకులు, కోడండ్రును తనకుపచారమును చేయుదురనుకొనుట అవివేకమనిరి. తనను వారు పోషించుటకు బదులు దూషింతురుగాన, నీ సంసార బంధమును సవాసనగ నివర్తించుటకు నెంతపాపినైన పూతమొనర్చు యతిరాజుల భజనయే ఉపాదేయమనిరి. సర్వజనహితమగు నీ సిద్ధాంతప్రవర్తన జేయుటచేతనే శ్రియఃపతి యతిరాజులనాశ్రయించు చేతనులను యముని వాతబడకుండ తన సాన్నిధ్యమును జేర్చుకొనుననిపల్కిరి. ఈ సిద్ధాంత రహస్యముల ననుసంధించు వారలకు శత్రువులు లేకుండుటయే గాక, వారు సర్వలోకసంపూజ్యులగుదురనిరి. శ్రీయతిరాజ నామాక్షరములు మంత్రముగ ననుసంధించువారు తరింతురనియు, అట్టి సిద్ధాంతావ లంబులను దూషించువారు ఇహపరములకు చెడుదురని స్పష్టముగ నుపదేశించిరి. విద్యాధనాభిజనమదములు మహాపాతకములు గాన, వాటిని వీడనిదే యీ భజన ప్రాప్తించదనిరి. యౌవన మతిచంచలముగాన, దానివలన గర్వించి చెడక శ్రీ రామానుజులను భజించుడని యువతులకు ఉపదేశమొనర్చిరి. ఆడంబరోపేతులగు సన్న్యాసుల నాశ్రయించి మోసపోకుడని హెచ్చరించిరి. తర్కశాస్త్రము నిరర్థకమనిరి. ప్రాకృతుల కృతులను బహిష్కరింపుమనిరి. కపటమస్కరమౌని దిగంబరులు ఉపదేష్టలని



భ్రమించవలదనిరి. అనంతరము శ్రీరామానుజుల అవతారక్రమమును, వారి అలంకరణవిధానాదులను ధ్యానావలంబనార్థ ముపదేశించిరి. ఉపాయోపేయములు రెండు నీ యతిరాజులే యనిరి. వేదాధ్యయనాదులు గాని, సంసారవైరాగ్యముగాని, దేవతాంతర భజనగాని, యీ భజనకు సాటిగావనిరి. ఇట్లుపదేశించి, చివరకు సాధనాంతరము లన్నిటిని వీడి యతిరాజభజన చేయుటయే మోక్షసామ్రాజ్య సౌధాధిరోహణసాధనమని ప్రమాణపూర్వకముగా నుపదేశించిరి. చివరగా తమ గోత్రనామధేయముల నంకిత మొనర్చి స్తుతిని ముగించిరి.

---

**శ్రీమతే రామానుజాయ నమః**

**సాలగ్రామస్థలాచార్య పురుషోద్దండవేదాంత రంగనాథార్య విరచితమైన**

# భజయతిరాజస్తోత్రమ్

పల్లవి : **భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

భవ = సంసారమును గురించి, (హే) భీరో = భయపడునట్టివాడా!, యతిరాజం= (యతులకు రాజైన), శ్రీరామానుజులను, భజ = సేవించుము. యతిరాజం = ఉడైయ వరులను, భజ = సేవించుము, యతిరాజం = ఉడైయవరులను, భజ = సేవించుము.

అవ : "భజ యతిరాజమ్" అని అన్నారు కదా ! శ్రీరామానుజులను ఎందులకు భజించాలి? అను ప్రశ్నకు సమాధానమును వరుసగా మూడు చరణములతో పల్కుచున్నారు.

**శ్రీరఙ్గేశజయాశ్రయ కేతు శ్శ్రితజనసంరక్షణజీవాతుః ।**
**భవభయజలధే రేష హి సేతుః పద్మానేతుః ప్రణతౌ హేతుః ॥ ॥ 1 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

శ్రీరంగేశ = రంగనాథునియొక్క, జయ = విజయమునకు, ఆశ్రయ= ఆధారమైన, కేతుః = ధ్వజముగానున్నవారు, శ్రితజన = ఆశ్రితులను, సంరక్షణ = కాపాడుటయందు, జీవాతుః = జీవనౌషధమైనవారును, భవభయ = సంసారభయమును, జలధేః =

సముద్రమునకు, ఏషః = వీరు(గదా), సేతుః = ఆనకట్ట, పద్మానేతుః = శ్రియఃపతియొక్క ప్రణతౌ = సేవయందు (పొందుటయందు) హేతుః = కారణమైనవారు.

తా॥ శ్రీరామానుజులు, రంగనాథుల వైభవమునకు ఆశ్రయమైన విజయమును సూచించు ధ్వజమువంటివారు. వారికి సంజీవియను దివ్యౌషధమెటులో, అటులే శ్రీఎమ్బెరుమానార్ చేతనకోటికిని ఆధారమైనవారు. వీరిని ఆశ్రయించినవారు భయంకరమైన, ఘోరమైన సంసారమనే సముద్రమును సులభముగా దాటగలరు. కావున, ఓ మనసా ! యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

**"శ్రీరంగేశజయధ్వజో విజయతే రామానుజోయం మునిః"** అను ధాటీపంచక శ్లోకసూక్తి స్మరణీయము.

అవ : శ్రీరామానుజుల పలు అవతారములను ప్రస్తుతిస్తున్నారు.

**ఆదౌ జగదాధార శ్శేష స్తదను సుమిత్రానందనవేషః ।**
**తదుపరి ధృతహలముసలవిశేష స్తదనంతర మభవద్గురు రేషః ॥2॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

ఆదౌ = ప్రథమమున, జగత్+ఆధారః = జగత్తుకు ఆధారముగనుండు, శేషః= ఆదిశేషులుగాను, తదను = పిమ్మట, సుమిత్రానందన వేషః = సుమిత్రాదేవి కుమారులైన లక్ష్మణులుగ అవతరించి, తదుపరి = అటు పిమ్మట, ధృతహల ముసలవిశేషః=చేతిలో నాగేటిని రోకలిని ధరించిన బలరాముడుగాను, తత్+అనంతరం = అటు పిమ్మట, ఏషః గురుః = ఈ యతిరాజులుగా, అభవత్ = అవతరించిరి.

తా॥ కృతయుగమున సాక్షాత్తు శ్రియఃపతియొక్క పాన్పుగా యున్న అనంతాళ్వాన్ త్రేతాయుగమున దశరథ చక్రవర్తి కుమారుడైన లక్ష్మణావతారముగను, ద్వాపరయుగము నందు శ్రీకృష్ణపరమాత్ముని సోదరుడైన బలరామావతారముగను అవతరించిరి. కలియుగమునందు లోకమునకు అద్వితీయులైన గురువుగాను అవతరించిన శ్రీరామానుజులవారిని, ఓ మనసా!, సేవించుము, సేవించుము, సేవించుము.

**అనంతః ప్రథమం రూపం త్రేతాయాం లక్ష్మణ స్తథా ।**
**ద్వాపరే బలభద్రశ్చ కలౌ కశ్చిత్ భవిష్యతి ।** – అను పౌరాణిక సూక్తి స్మరణీయము



అవ : తత్త్వయాథాత్మ్యాన్ని ఉపదేశించిన శ్రీరామానుజులకంటే గొప్పదాత ఇంకొకరు లేరని అనుచున్నారు.

**భుంక్తే వైషయికం సుఖమన్యః ప్రచకాస్త్యేవానశ్నన్ అన్యః ।**
**ఇతి య స్తత్త్వం ప్రాహ వదాన్య స్తస్మాదధికః కో ను వదాన్యః ॥ 3 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

అన్యః= ఇతరుడు ఒకడు (జీవుడు), వైషయికం = విషయ సంబంధమైన, సుఖం = సుఖమును, భుంక్తే = అనుభవించుచున్నాడు, అన్యః = మఱియొకడు (పరమాత్మ), అనశ్నన్ = అనుభవించనివాడై, ప్రచకాస్తి ఏవ = ప్రకాశించుచునే యున్నాడు, ఇతి = అని, యః వ దాన్యః = ఏ దాత, తత్త్వం = యాథాత్మ్యమును, ప్రాహ = చెప్పెనో, తస్మాత్ = వానికంటె, అధిక = అధికుడైన, వదాన్యః = గొప్ప దాత, కః ను = ఎవరు ఉన్నారు?

తా॥ జీవుడు ప్రకృతిలోనున్న విషయ సుఖముల ననుభవించుచు పరమానంద ములో మునిగియున్నాడు. పరమాత్మ అట్టి అశాశ్వతమైన దుఃఖకరమైన వాటి ననుభవించకయే ప్రకాశించుచున్నాడు. ఇట్టి ఈ రెండిటికిని గల భేదమును మనకు విశదీకరించి మనలను కడతేర్చినట్టి శ్రీరామానుజులవారిని, ఓ మనసా! సేవించుము, సేవించుము, సేవించుము.

**ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిషస్వజాతే ।**
**తయో రన్యః పిప్పలం స్వాద్వత్తి అనశ్నన్నన్యో అభిచాకశీతి ॥ 3 ॥**

(ఓ శౌనకుడా! ఎల్లప్పుడున్ను పరస్పరము అనుసరించి పొందుచుండెడి జీవ పరమాత్మలిద్దరును ఆ పరబ్రహ్మస్వరూపమే కారణముగాగల నాశనమగుచుండెడి ఒక్కటియగు ఈశరీరమును, ఫలానుభూతికొరకు, పక్షులు చెట్టును వలెనే, పొందియున్నారు. ఆ ఇద్దరిలో, జీవుడు విచిత్రములగు కర్మలవలన కలిగెడి సుఖదుఃఖ రూపఫలమును, అజ్ఞానముచేత అనుభవించుచున్నాడు. సర్వజ్ఞుడగు ఈశ్వరుడు నిత్యశు ద్ధ బద్ధముక్త స్వభావుడై, ప్రేరకుడై ఆ కర్మఫలమును తాననుభవించకనే కేవలము నిత్యసాక్షియై చూచుచున్నాడు). అనెడి ఉపనిషద్వాక్యం స్మరణీయం.

అవ : తత్త్వజ్ఞానంలేనిచో ఏమి లోటు? అనినచో, అందులకు సమాధానమును పల్కుచున్నారు.

**నష్టే నయనే కస్యాలోక శ్చిత్తే మత్తే కస్య వివేకః ।**
**క్షీణే పుణ్యే క స్సురలోకః కామే ధూతే క స్తవ శోకః ॥ 4 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

నయనే = నేత్రము, నష్టే = పోవుచుండగా, కస్య = ఎవనికి, ఆలోకః = చూపు కల్గును, చిత్తే = మనస్సు, మత్తే = మదించియుండగా, కస్య=ఎవనికి, వివేకః= జ్ఞానము కల్గును?, పుణ్యే =పుణ్యము, క్షీణే = నశించినదగుచుండగా, సుర లోకః = స్వర్గలోకము, కః= ఏది, కామే = కామము, ధూతే = పోయినదగుచుందగా, తవ = నీకు, శోకః= శోకము, కః = ఏది ?

తా॥ ఎవనికి చూపు పోయినదో, మనస్సు మదించియున్నదో అట్టివానికి పుణ్యము, జ్ఞానము నశించును. కావున, వానికి స్వర్గలోకము దొరుకదు. సుఖము లేదు. ఎవనికి కామము పోవునో, అట్టివానికి దుఃఖము లేదు. కావున, ఓ మనసా !, అట్టి శాశ్వతసుఖము దొరుకుటకును, కామము నశించుటకును యతిరాజులవారిని సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : జ్ఞానసముపార్జనకు ఇపుడేమితొందర? అనినచో దానికి బదులు పల్కుచున్నారు.

**నిశి వనితాసుఖనిద్రాలోలః ప్రాతః పరదూషణపటుశీలః ।**
**అంతర్యాతి నిజాయుః కాలః కిం జానాతి నరః పశులీలః ॥ 5 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

నిశి = రాత్రియందు, వనితాసుఖ = స్త్రీ సుఖమునందును, నిద్రా = నిద్రయందును, లోలః = ఆసక్తిని కలవాడగుచున్నాడు, ప్రాతః = ఉదయముపూట, పరదూషణ = ఇతరులను దూషించుటయందు, పటుశీలః = దిట్టమైన స్వభావము గలవాడు, (నిజాయుః కాలః) నిజ = తనయొక్క, ఆయుః కాలః = ఆయువు, అంతర్యాతి= అంతరించిపోవు చున్నది, పశులీలః = పశువిధముగావర్తించే, నరః = (ఈ) నరుడు, కిం = దేనిని, జానాతి = తెలుసుకొనుచున్నాడు?



తా॥ చేతనుడు రాత్రి సమయమున స్త్రీ సుఖమునందును, నిద్రయందును ఆసక్తి గలవాడగుచున్నాడు. ఉదయముపూట పరులను దూషించుటయందు దిట్టమైన స్వభావమును గలవాడగుచున్నాడు. వానియొక్క యావజ్జీవము యీ విధముగానే అంతరించి పోవుచున్నది. కావున, పశువిధముగాయున్న నరుడు దేనిని తెలుసుకొన గల్గుచున్నాడు. ఓ మనసా! యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : జ్ఞానాన్ని సంపాదించినా, శ్రీరామానుజుల విషయంలో భక్తి కుదరడం దుర్లభమనుచున్నారు.

**కేచిల్లీలాలాలసగతయః కేచిద్బాలాలాలితరతయః ।**
**కేచిడ్డోలాయితహతమతయః కేపి న సంత్యర్చిత యతిపతయః ॥ 6 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

కేచిత్ = కొందరు, (లీలాలాలసగతయః) లీలా = విలాసముల యందు, లాలస= ఆసక్తి గల, గతయః = నడకలు గలవారు, కేచిత్ = కొందరు, బాలాః = స్త్రీలచేత, లాలిత = బుజ్జగించబడిన, రతయః = రతులు గలవారు, కేచిత్= కొందరు, (డోలాయితహతమతయః) డోలాయిత = ఊగిసలాడే, హత = కొట్టబడిన, మతయః= మనస్సు గలవారు, (అర్చిత యతిపతయః) అర్చిత = పూజింపబడిన, యతిపతయః= శ్రీరామానుజులను గలవారలు, కేపి = ఎవరుకూడ, న సంతి = లేరు.

తా॥ కొందరు విలాసములయందాసక్తి గల నడకలు గలవారు. కొందరు స్త్రీసుఖాసక్తులు. కొందరు తూగుటుయ్యలలో ఆనందించువారు, కావున, ఓ మనసా ! శ్రీరామానుజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : సంసారానుభవమున విరక్తులైన వృద్ధులు సైతం యతిరాజులను ఎందుకు భజించడంలేదంటే, దానికి బదులు పల్కుతున్నారు.

**యావానబలో జరయా దేహ స్తావా న్ప్రబలో విషయే మోహః ।**
**వచసి విరక్తి శ్రుతిపరివాహో మనసి హిత స్త్వపరోపి వివాహః ॥ 7 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

జరయా = ముసలితనముచేత, దేహః = శరీరము, యావాన్ అబలః = ఎంత బలహీనమైనదో, విషయే = విషయములందు, మోహః = మోహము, తావాన్ ప్రబలః= అంత బలమైనది, రచన = మాటలయందు, విరక్తిశ్రుతి= వైరాగ్యబోధక శ్రుతులయొక్క, పరివాహః = ప్రవాహము, మనసి = మనస్సునందు, అపరోపి వివాహః అస్తు = ఇంకొక వివాహము కూడ, హితః = యిష్టమైనది.

తా॥ ముసలితనముచేత శరీరము బలహీనమగుకొలది, విషయములందు మోహమంత బలమగును. మాటలయందు వైరాగ్యబోధక శ్రుతులయొక్క ప్రవాహము పరుగెత్తుచుండగా మనస్సు ఇంకొక వివాహమైనను చేసికొనవలెనను తలపులు కలుగును. కావున, ఓ మనసా! విషయభోగ లాలసను తీర్చు యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

**"న కామః కామానాముపభోగేన శామ్యతి, హవిషా కృష్ణవర్త్మేన పునర్భూయోభి వర్ధతే"** అనుసూక్తి స్మరణీయము.

అవ : అట్లయిన, ఎంత అనుభవించినా తీరని సాంసారిక భోగాలను విడువవచ్చుకదా! ఎందుకు విడువడంలేదంటే సమాధానాన్ని తెల్పుతున్నారు.

**కలుషనికాయం లలనాకాయం పశ్యన్ ముహ్యసి సాయం సాయమ్ ।**
**జహి జహి హేయం తద్వ్యవసాయం భజ నిరపాయం చరమోపాయమ్ ॥ 8 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

కలుష = పాపమునకు, నికాయం = ఉనికిపట్టైన, లలనాకాయం = స్త్రీ శరీరమును, సాయం సాయం = ప్రతి సాయంకాలమును, పశ్యన్ = చూచుచున్నవాడవై, ముహ్యసి = మోహించుచున్నావు, హేయం = నీచమైన, తద్వ్యవసాయం = ఆ వ్యాసంగమును, జహి జహి =వదలి పెట్టుము, నిరపాయం = అపాయము లేని, చరమోపాయం = పంచమోపాయమును, భజ= పొందుము.

తా॥ పాపమున కునికిపట్టైన స్త్రీ శరీరమును ప్రతిసాయంకాలమును చూచుచున్నవాడనై మోహించుచున్నావు. నీచమైన ఆ వ్యాసంగమును వదలిపెట్టుము. అపాయము లేని ఆచార్యుడే పరదైవమనే పంచమోపాయమును పొందుము. కావున



అట్టి పంచమోపాయమును పొందుటకు, ఓ మనసా !, యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : సంసారసుఖాన్ని విడువమనడం ఎందుకు? దానిని అనుభవిస్తూ, శ్రీరామానుజులను భజించవచ్చుకదా? అనే ప్రశ్నకు సమాధానాన్ని ఇస్తున్నారు.

**రాత్రిం దివమపి భిక్షాచర్యా కలహాయైవాగచ్ఛతి భార్యా ।**
**మధ్యే బాంధవసేవా కార్యా కథయ కదా తవ దేవ సపర్యా ॥ 9 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

రాత్రిం దివమపి = రాత్రింబవళ్ళు, భిక్షాచర్యా= భిక్షాటన మొనర్చుటయు, భార్యా= భార్య, కలహాయ ఏవ = జగడముకొరకు, ఆగచ్ఛతి = వచ్చుచున్నది, మధ్యే = నడుమ, బాంధవసేవా = చుట్టముల పరిచర్య, కార్యా = చేయవలసి ఉన్నది, దేవ = ఓ మనసా! తవ = నీ, దేవ సపర్యా = సేవా, కదా = ఎప్పుడు, కథయ = చెప్పుము.

తా॥ రాత్రింబవళ్లు భిక్షాటన మొనర్చుచు కాలము గడుపుచుండగా, భార్య జగడము కొరకు వచ్చుచున్నది. మధ్య, చుట్టముల సేవ చేయవలసియున్నది. నీయొక్క సేవ ఎప్పుడో తెలియలేదు. కావున, ఓ మనసా!, యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : అయితే సంసారజంఝాటనలను లేనివారు యతిరాజులను భజించవచ్చు కదా! వారుకూడా ఎందకు చేయడం లేదంటే దానికి బదులును తెల్పుతున్నారు.

**అంధం నయనం భూమౌ శయనం మందం వచనం మలినం వదనమ్ ।**
**తస్మిన్కాలే గోప్తుం సదనం వాంఛసి దత్తతనూజానయనం ॥ 10 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

నయనం = కన్ను, అంధం = కనుపించనిది, భూమౌ = భూమి యందు, శయనం= పడక, వచనం = మాట, మందం = మందమయినది, వదనం = ముఖము, మలినం = మురికి అయినది, తస్మిన్ కాలే = అట్టి తరుణమునందు, సదనం = ఇంటిని, గోప్తుం = కాపాడుటకొరకు, దత్త తనూజ = దత్తపుత్రునియొక్క ఆనయనం=

తీసికొనివచ్చుటను, వాంఛసి = కోరుచున్నావు.

తా ॥ కన్ను కనిపించకుండా ఉండేటపుడు, మాట మందగించి ముఖము ముదిరికి అయినపుడు, ఇంటిని కాపాడుటకు దత్తపుత్రుని తీసుకొనివచ్చు కోరిక గలుగును. కావున ఓ మనసా, అట్టి కోరికలు లేకుండా, యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : యతిరాజుల భజనను చేయకపోవడానికి సంసారజంఝాటనే కాక, అహంకారం కూడా కారణమంటున్నారు.

**తాళచ్ఛదకృతకుబ్జకుటీర స్సాయం సంధ్యా కబళాహారః ।**
**వివిధపటచ్చరధారః క్రూర స్సోపి విరించిసమాహంకారః ॥ 11 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

తాళచ్ఛద = తాటియాకులచేత, కృత = చేయబడిన, కుబ్జకుటీరః = చిన్న గుడిసె గలిగినవాడును, సాయం సంధ్యా కబళాహారః= సాయంకాలం మధూకరమునే తిండిగా గలవాడును, వివిధ = పలు విధములైన, పటచ్చర = జీర్ణవస్త్రములను, ధారః=ధరించినవాడును, క్రూరః = క్రూరుడైన, సః+అపి =అటువంటివాడుకూడ, విరించిసమ= బ్రహ్మదేవునితో సమానమైన, అహంకారః= గర్వము గలవాడు.

తా॥ తాటియాకులచే కప్పబడిన చిన్నగుడిసెను గలవాడవై సాయంకాలపు మధూకరమే ఆహారముగా గలిగినవాడవై పలువిధములైన జీర్ణవస్త్రములను ధరించుచున్న వాడైనా. అమితక్రూరమైన స్వభావముతో యున్నాడు. బ్రహ్మదేవునితో సమానమైన గర్వమును గలవాడై ఉన్నాడు. (తనను బ్రహ్మతో సమానముగా భావించుచున్నాడు) కావున, ఓ మనసా!, యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : యతిరాజుల భజన చేయకపోతే ఏమి? మోక్షసాధనాలైన యజ్ఞయోగ త్యాగాదులనేకం ఉన్నాయికదా ! అంటే బదులు పల్కుతున్నారు.

**మన్త్రద్రవ్యవిశుద్ధో యాగ స్సర్వారంభవిరాగ స్త్యాగః ।**
**కర్తుం శక్యో న కలౌ యోగః కిం తు యతీశగుణామృతభోగః ॥12 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**



యాగః = యాగము, మంత్ర ద్రవ్య విశుద్ధః = పదార్థవిశుద్ధమైనది,త్యాగః= ఈ వి (ఆత్మసమర్పణ), (స్సర్వారంభవిరాగః), సర్వారంభ = అన్ని ప్రయత్నములయందును, విరాగః = వైరాగ్యముతో కూడినవి, కలౌ = కలియుగమునందు, యోగః = యోగము, కర్తుం = చేయుటకు న శక్యః = సాధ్యమైనది కాదు, కిం తు= ఇక ఏమన, యతీశ = ఉడైయవరులయొక్క, గుణామృత = గుణములైన అమృతముయొక్క, భోగః = అనుభవము.

తా॥ అన్ని ప్రయత్నములయందు మంత్రవిరుద్ధము కాకుండా ఆత్మ సమర్పణము చేయు యాగము. సర్వారంభత్యాగ పూర్వకమైన యోగు సాధ్యము కాదు. కనుక, ఓ మనసా! యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : సంసారం సుఖాలు మాక ఎంతో భోగ్యంగా కన్పిస్తున్నావే ! వానిపట్ల మాకు వైరాగ్యం కల్గడంలేదే! – అంటే, సంసారంపట్ల వైరాగ్యము కల్గుటకు అందలి దోషాలను ప్రతిపాదనచేస్తూ, మొదటగా యతిరాజుల భజనవల్ల మనకు ముందు ఏమి కల్గునో తెలియదుకాని, ప్రస్తుతము సుఖమును కల్గించు ఈ సంసారమును ఎట్లు విడువగలము? అను ప్రశ్నకు సమాధానమును పల్కుచున్నారు.

**ఉపరి మహోపలవర్షాసారః మార్గే కంటక కర్దమపూరః ।**
**కక్షేభార శ్శిరసి కిశోర స్సుఖయతి ఘోరః కస్సంసారః ॥ 13 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

ఉపరి = పై భాగమునందు, మహోపల = వడగండ్లవాన, వర్ష+అసారః = జడివానయు, మార్గే = మార్గమునందు, కంటక = ముండ్లు గలిగిన, కర్దమ = బురదగల, పూరః = ప్రవాహము, కక్షే = చంకయందు, భారః =మూట బరువు, శిరసి = తలయందు, కిశోరః= చిన్నపిల్లవాడును, ఘోరః = భయంకరమైన, కః సంసారః = ఏ సంసారము, సుఖయతి = సుఖపెట్టుచున్నది.

తా॥ : పైన వడగండ్ల, జడివానయు, మార్గమునందు ముండ్లు గలిగిన బురదప్రవాహము. చంకయందు బరువు, తలయందు చిన్నపిల్లవాడును. ఇటువంటి భయంకరమైన ఏ సంసారము సుఖపెట్టుచున్నది ? కావున ఓ మనసా ! యతిరాజులను

సేవించుము, సేవించుము, సేవించుము.

**భజసి వృథా విషయేషు దురాశాం వివిధవిచిత్రమనోరథ కోశామ్ ।**
**కియదపి లభసే న హి తత్రైకం కింతు వ్రజసి మహాంతం శోకమ్ ॥14॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

విషయేషు = ఇహలోక విషయులయందు, వృథా = వ్యర్థము, (వివిధ... కోశాం) వివిధ= నానావిధములైన, విచిత్ర = చిత్రములైన, మనోరథకోశాం = కోర్కెలకు ఆధారమైన, దురాశాం = దురాశను, వృథా భజసి = వ్యర్థముగా పొందుచున్నావు, తత్ర = ఆ సంకల్పమునందు, ఏకం = ఒకదానిని గురించి, కియదపి = కొంచెమైనను, న లభసే హి = పొందవుగదా, కిం తు = ఇకనేమంటే, మహాంతం = గొప్పదియగు, శోకం = శోకమును, వ్రజసి = పొందచున్నావు.

తా ॥ ఇహలోక విషయములయందు వ్యర్థముగా, నానావిధములైన, చిత్రములైన కోర్కెలకు నిలయమైన, గర్భమందు దురాశను పొందుచున్నావు. కాని అట్టి సంకల్పము ద్వారా కొంచెమైనను సుఖమును పొందవు. కావున ఓ మనసా యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : సంసార సుఖాలపట్ల కోరికలు వ్యర్థమనుట ఎందులకు ? ముసలి తనములో కొడుకులు, కోడళ్ళు సహాయపడరా ?– అను ప్రశ్నకు బదులిస్తున్నారు.

**కశ్చన లోకే కరపుటపాత్రః పాతుం సుత మాశ్రితమఠసత్రః ।**
**తస్మిన్ వృద్ధే సతి సకళత్ర శ్శపతి హి రండాసుత ఇతి పుత్రః ॥15॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

కశ్చన = ఒకడు, లోకే = లోకమునందు, సుతం = కుమారుని, పాతుం = కాపాడులకు, కరపుటపాత్రః = అరచేతిలో భిక్షాపాత్రను పెట్టుకొనినవాడై, ఆశ్రిత = ఆశ్రయించబడిన, మఠ = మఠములు, సత్రః = సత్రములు గలవాడగుచున్నాడు (సత్రములను, మఠములను ఆశ్రయించుచున్నాడు), తస్మిన్ = వాడు (ఆ తండ్రి), వృద్ధే సతి = ముసలివాడగుచుండగా, పుత్రః = (అతని) కుమారుడు, సకళత్రః = భార్యతో జేరినవాడై, రండాసుతః ఇతి = ముండకొడకా ! అని, శపతి హి = తిట్టుచున్నాడు



కదా !

తా॥ ఒకడు లోకమునందు అరచేతిలో భిక్షాపాత్రను పెట్టుకొనిన వాడై కుమారుని కాపాడుటకు మఠములకు, సత్రములకు తిరుగుచున్నాడు. అట్టివాడు ముసలివాడగు చుండగా, అతని కుమారుడు భార్యతో జేరినవాడై ఆ తండ్రిని "ముండాకొడకా" యని తిట్టుచున్నాడు. కావున, ఓ మనసా ! నీవు యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : కష్టించి, పోషించిన తండ్రిని కుమారుడెందులకు దూషించునను ప్రశ్నకు సమాధానమునిచ్చుచున్నారు.

**మనుజపతిం వా దిగధిపతిం వా జలజభవం వా జగదధికం వా ।**
**మమతాహంకృతిమలినో లోకో నిందతి నిందతి నిందత్యేవ ॥ 16 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

మనుజపతిం వా = రాజునుగాని, దిక్+అధిపతిం వా = దిక్పాలునిగాని, జలజ భవం వా = బ్రహ్మనుగాని, జగదధికం వా = లోకమున కంతటికి అధికుడైనవానిని (భగవంతుని) గాని, మమతా = స్వార్థముచేత, అహంకృతి = అహంకారముచేత, మలిన్ణ= మురికియైన, లోకః = లోకము, నిందతి = నిందించుచున్నది, నిందతి = నిందించుచున్నది, నిందత్యేవ = నిందించుచునే యున్నది.

తా॥ రాజునుగాని, దిక్పాలునిగాని, బ్రహ్మనుగాని, లోకమున కంతటికి అధికుడైన వానినిగాని (భగవంతునిగాని) స్వార్థముతో, అహంకారముతో "నేను, నాది అని కొట్టుకొనుచున్నవారిని లోకము నిందించుచున్నది. నిందించుచునేయున్నది. కావున, ఓ మనసా! యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : ఇంతవరకు సంసారముపట్ల వైరాగ్య భావనకల్గుటకు అందలి దోషములను విస్తృతముగా ప్రతిపాదించి, ఇందులో యతిరాజులను భజించుటవలన కల్గు ప్రయోజనమును గూర్చి పల్కుచున్నారు.

**పాపహతో వా పుణ్యయుతో వా సురనరతిర్యగ్జాతిగతో వా ।**
**రామానుజపదతీర్థాన్ముక్తిం విందతి విందతి విందత్యేవ ॥ 17 ॥**

**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

పాప = పాపముచేత, హతః వా = కొట్టబడినవాడుగాని, పుణ్యా = పుణ్యముతోటి, యుతః వా = కూడినవాడుగాని, (సుర.... గతోవా) సుర = దేవతలయొక్కయు, నర= మనుష్యులయొక్కయు, తిర్యక్ = పశుపక్ష్యాదులయొక్కయు, జాతి = జాతిని, గతః వా = పొందినవాడు గాని, రామానుజ= ఉడైయవరులయొక్క పదతీర్థాత్ = శ్రీపాదతీర్థము వలన, ముక్తి = మోక్షమును, విందతి = పొందుచున్నాడు, విందతి = పొందుచున్నాడు. విందత్యేవ = పొందుచునేయున్నాడు.

తా॥ పాపముచేత బాధపడుచున్నవాడు గాని, పుణ్యముతోటి కూడినవాడుగాని, దేవతలయొక్కయు, అధమములైన మనుష్యులయొక్కయు, పశుపక్ష్యాదులయొక్క జాతులలో పుట్టినవాడు కాని ఉడైయవరుల శ్రీపాదతీర్థమువలన మోక్షమును పొందుచున్నాడు. పొందుచున్నాడు. పొందుచునే యున్నాడు. కావున, ఓ మనసా! యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : యతిరాజులకు ఇంతటి మహిమ ఏవిధముగా వచ్చినది ? అనినచో, పరమవైదికమైన విశిష్టాద్వైత సిద్ధాంతమును ప్రవర్తింపజేసినందువల్లనే అని అనుచున్నారు.

**గుణగుణినో ర్భేదః కిల నిత్య శ్చిదచిద్ద్వయపరభేద స్సత్యః ।**
**తద్ద్వయదేహో హరిరితి తత్త్వం పశ్య! విశిష్టాద్వైతం తత్త్వమ్ ॥ 18 ॥**

**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

గుణగుణినోః = (ఒక) గుణమునకును, (ఆ) గుణము గలవానికిని, భేదః= భేదము, నిత్యః కిల = నిత్యమైనది గదా, (చిత్ అచిత్ ద్వయపరభేదః సత్యః) = చిత్ = చిత్తు, అచిత్ = అచిత్– అను, ద్వయ = రెండిటికిని, పర = పరమాత్మకును మధ్యగతా, భేద్ణ= భేదము, సత్యః = సత్యము, తద్ద్వయ = ఆ రెండిటిని (చిదచిత్తులను), దేహః = శరీరముగా గలవాడు, హరిః = విష్ణువు, ఇతి= అనునది, తత్త్వం = యథార్థము, విశిష్టాద్వైతమ్ = విశిష్టాద్వైతమని చెప్పబడు, తత్త్వమ్ = తత్వమును, పశ్య = చూడు.

తా॥ గుణమునకును, గుణము గలవానికిని భేదము నిత్యము. చిత్తు, అచిత్తు –



అను రెంటికిన్ని, పరునకును భేదము సత్యము. ఆ రెండిటిని శరీరముగా గలవాడు విష్ణువు. ఇదియే విశిష్టాద్వైతతత్త్వము. కావున, ఓ మనసా! ఆ తత్త్వమును తెల్పిన యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : ఇటువంటి గొప్ప విశిష్టాద్వైత సిద్ధాంతమును ఆసేతు హిమాచలము వరకు వ్యాపింపజేసి, శ్రియఃపతి చింతను తీర్చిరి – అనుచున్నారు.

**యతిపతిపదజలకణికాసేక శ్చతురక్షర పదయుగ్మవివేకః ।**
**యస్య తు సాలనగర్యవలోక స్తస్య పదేన హతో యమలోకః ॥ 19 ॥**

**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

(యతి... సేకః), యతిపతి = ఉడైయవరులయొక్క, పదజల = శ్రీపాదతీర్థము యొక్క, కణిక = చాలాచిన్న బిందువుయొక్క, సేకః=తుంపురులుకూడ, (చతు... వివేకః), చతురక్షర = నాలుగక్షరములు గల, పదయుగ్మ = రెండు పదములయొక్క, వివేకః= విజ్ఞానము, సాలనగరి = మిథిల సాలగ్రామముయొక్క, అవలోకః = సేవయు (దర్శనమును) యస్య తు = ఎవనికైతే, (కలదో), తస్య = అట్టివానియొక్క, పదేన = పాదముచేత, యమలోకః = యమలోకము, హతః = నశించబడినది.

శ్రీరామానుజులవారు, సాలగ్రామము (సుదర్శనశిల) అను గ్రామమున వేంచేసి యుండునపుడు ఆ యూరివారందరు శైవులుగను, జైనులుగను ఉండిరి. అచట ఎవరును వారిని ఆశ్రయించక పోయిరి. ఆ సమయమున, ఆ ఊరివారు నీటిని తీసికొనిపోవు సరస్సున శ్రీపాదతీర్థమును చేర్చమని ముదలియాణ్డానుకు నియమించిరి. ఆణ్డాన్ ఆ ప్రకారము చేయగా, ఆ తీర్థ ప్రభావమువలన కొందఱికి జ్ఞానోదయమై శ్రీరామానుజులను ఆశ్రయించిరి. అందులో ప్రముఖులగు శ్రీవడుగనంబి శ్రీరామానుజులను ఆశ్రయించి, ఒక కొలనుయందు శ్రీరామానుజులవారి శ్రీపాదతీర్థము చేర్చి నిక్షేపముగ యుంచి యున్నారు. ఇప్పటికిన్ని ఆ తీర్థమును పొందవచ్చును.

తా॥ శ్రీరామానుజుల శ్రీపాదతీర్థముయొక్క బిందువు తుంపురులును, నాలుగక్షరములుగల రెండు పదములు గల రామానుజ నామము యొక్క విజ్ఞానమును, మిథిల సాలగ్రామముయొక్క సేవయును ఎవనికి (కలదో) అట్టివాని పాదసంబంధముచేత

యమలోకము నశించును. కావున, ఓ మనసా! యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : ప్రసంగాత్, లోకోపకారకములగు నీతులను ఉపదేశించిన రీతిని విశిష్టాద్వైతసిద్ధాంతము వైనాన్ని పల్కుతున్నారు.

**చింతయ సర్వం చిదచిద్రూపం తనురితి తస్య హరే రనురూపమ్ ।**
**తస్మాత్ కస్మిన్ కలయసి కోపం పశ్చాద్భజసి దురాపం తాపమ్ ॥ 20 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

చిదచిద్రూపమ్ = చిత్తు, అచిత్తులయొక్క రూపములుగా నున్న (జీవప్రకృతులతో కూడిన) సర్వం = సమస్తమును, తస్య = ఆ, హరేః = విష్ణుమూర్తికి, అనురూపం = తగినట్టి, తనురితి = శరీరమనుటను, చింతయ = యోచించుము, తస్మాత్ = అందు వలన, కస్మిన్ = దేనియందు, కోపం = కోపమును, కలయసి = చూచుచున్నావు, పశ్చాత్ = తర్వాత, దురాపమ్ = ఆపరాని, తాపమ్ = తాపమును, భజసి = పొందుచున్నావు.

తా॥ చిత్తు-అచిత్తుల రూపములుగానున్న (జీవప్రకృతులతో కూడిన) సమస్తమును ఆ విష్ణుమూర్తికి తగినట్టి శరీరమని భావించుము. అట్లు భావించిన దేనియందు కోపమును చూచుచున్నావు? దేనియందు ఆపరాని తాపమును పొందుచున్నావు? కావున ఓ మనసా! యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : ఇంతవరకు శ్రీరామానుజులయొక్క, విశిష్టాద్వైత సిద్ధాంతము యొక్క వైభవమును పల్కి, ఇకపై రెండు శ్లోకములద్వారా శ్రీరామానుజులను, విశిష్టాద్వైతమను అనుసరించువారి గొప్పతనమును గూర్చి పల్కుచున్నారు.

**యశ్చతు రక్షర మంత్రరహస్యం వేద తమేవ వృణీహి సదస్యమ్ ।**
**తచ్చరణద్వయదాస్య ముపాస్యం తద్విపరీతం మత మపహాస్యమ్ ॥21॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

యః = ఎవడు, (చతు..... రహస్యం), చతురక్షరమంత్ర = నాల్గు అక్షరములను కల రామానుజ మంత్రముయొక్క, రహస్యం = రహస్యమును, వేద= ఎరుంగునో, తమ్ ఏవ = వానినే, సదస్యం = చతురినిగా, వృణీహి = వరించుము, (తచ్చరణద్వయ దాస్యం), తత్ = ఆ రామానుజ మంత్రానుష్ఠాన పరునియొక్క, చరణద్వయ = రెండు పాదములయొక్క, దాస్యం = సేవ, ఉపాస్యం = ఉపాసించతగినది, తద్విపరీతం = దానికంటె వేఱగు, మతం =మతము, అపహాస్యం =ఎగతాలి చేయదగినది.

తా॥ ఎవడు నాల్గు అక్షరములను కల రామానుజమంత్రముయొక్క రహస్యమును ఎరుంగునో, వానినే చతురునిగా భావించుము. ఆ రామానుజమంత్రానుష్ఠానపరునియొక్క రెండు పాదముల సేవ ఉపాసించదగినది. కావున, ఓ మనసా! యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.



**వైష్ణవకులగుణదూషణచింతాం మా కురు నిజకులశీలాహన్త్రామ్ ।**
**యతిపతిరేవ హి గురు రేతేషా మితి జానీహి మహత్త్వం తేషామ్ ॥22॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

నిజ = తన, కుల = కులముయొక్క, శీల = సత్ స్వభావమును, హంతాం = నశింపచేయునదియగు, (వైష్ణవ... చింతామ్), వైష్ణవకుల = శ్రీవైష్ణవకులీనులయొక్క, గుణ = గుణములను, దూషణ = నిందించుటయందు, చింతాం = చింతను, మా కురు = చేయవద్దు, ఏతేషాం = ఈ శ్రీవైష్ణవులకు, యతిపతిః ఏవ హి = ఉడైయవరులే గదా, గురుః = ఆచార్యులు, ఇతి = ఇట్లని, తేషాం = ఆ శ్రీవైష్ణవులయొక్క, మహత్త్వం= గొప్పతనమును, జానీహి = తెలుసుకొనుము.

తా॥ శ్రీవైష్ణవుల గుణములను నిందించుట తన కులముయొక్క సత్ స్వభావమును నశింపచేయునది. కావున ఆ చింతను చేయవద్దు. ఈ శ్రీవైష్ణవులకు ఉడైయవరులే ఆచార్యులనెడి వారి గొప్పతనమును తెలిసుకొనుము. ఓ మనసా! యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : ఇంతటి వైభవమును కల మార్గమును అందఱు ఎందుకు అవలంభించుట లేదనగా, విద్యాభిజన ధన మదములే కారణమనుచున్నారు.

**విద్యానిపుణా వయ మిత్యన్యే హృద్యా ధనినో వయమిత్యన్యే ।**
**సత్కులజాతా వయమిత్యన్యే తేషు కలిం పరిపూర్ణం మన్యే ॥ 23 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

అన్యే = ఇతరులు కొందఱు, వయం = మేము, విద్యా = విద్యయందు, నిపుణాః= సమర్థులము, ఇతి = అని, అన్యే = మఱికొందరు, వయం = మేము, హృద్యాః = రూపవంతులము, ధనినః= ధనికులము, ఇతి = అని, అన్యే = మఱికొందరు, వయం= మేము, సత్కుల = సద్వంశమునందు, జాతాః = పుట్టినవారము, ఇతి = అని, (భావించు చున్నారు), తేషు = వారలయందు, కలిం = అజ్ఞానము, పరిపూర్ణం = నిండినదానినిగా, మన్యే = తలచుచున్నాను.

తా ॥ కొందరు "మేము విద్యయందు సమర్థుల"మనియు, మఱికొందరు "మేము రూపవంతులము, ధనికుల" మనియు, మఱికొందరు "సద్ వంశమునందు పుట్టినవార" మనియు భావించుచున్నారు. అట్టివారందరిని అజ్ఞానముతో నిండినవారుగా తలచు చున్నాను. కావున, ఓ మనసా! యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : తమకెదురుగా కన్పించి, యౌవన రూపగర్వమును కల్గి, లౌకికసుఖాభి లాషలైన యువతులకు రెండు శ్లోకముల ద్వారా హితమును పల్కుచున్నారు.

**యమకింకరకరశూలే లోలే పతదభిఘాతవిఫాలే ఫాలే ।**
**దహతి తనుం ప్రతికూలే కాలే కిం రమయసి ? తత్కాలే బాలే ! ॥24॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

(హే) బాలే = ఓ చిన్నదానా!, (యమకింకర కరశూలే), యమకింకర = యమకింకరులయొక్క, కర = హస్తమునందలి, శూలే = శూలాయుధము, లోలే సతి= కదలుచుండగా, ఫాలే = ముఖము, (పతత్.... విఫాలే), పతత్ = పడుచున్న, అభిఘాత= దెబ్బచేత, విఫాలే = బ్రద్దలగుచుండగా, ప్రతికూలే = ప్రతికూలమైన, కాలే= కాలము నందు, తనువు = శరీరమును, దహతి సతి = కాల్చుచుండగా, తత్ కాలే = ఆ సమయమున, కిం రమయసి = ఏమి సుఖించగలవు?

తా. : ఓ చిన్నదానా! యమకింకరుల హస్తమునందలి శూలాయుధము కదలుచుండగా, దాని దెబ్బచేత ముఖము బ్రద్దలగుచుండగా, ప్రతికూలమైన కాలమున శరీరమును కాల్చుచుండగా ఆ సమయమున నీవు ఏమి సుఖించగలవు? కావున, ఓ మనసా ! యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.



**సుమసుకుమారం శోభితమారం రతిసుఖసారం యువతి శరీరమ్ ।**
**గతజీవిత మతిఘోరవికారం దృష్ట్వా గచ్ఛతి దూరం దూరమ్ ॥ 25 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

సుమ = పుష్పమువలె, సుకుమారం = సుకుమారమైనది, శోభిత = ప్రకాశింప జేయబడిన, మారం = మన్మథుని గలదియు, రతిసుఖ సారం = రతి సుఖమునందు శ్రేష్ఠమైనదియునగు, యువతిశరీరం = స్త్రీ శరీరము, గతజీవితం = ప్రాణము పోయినదికాగా, అతిఘోర = మిక్కిలి భయంకరమైన, వికారం = విరూపము గలదానినిగా, దృష్ట్వా = చూచి, దూరం దూరం = మిక్కిలి దూరముగా, గచ్ఛతి = తొలగి పోవుచున్నాడు.

తా॥ స్త్రీశరీరము పుష్పమువలె సుకుమారమైనది, మన్మథుని సైతము రంజింపచేయునది, రతిసుఖమునందు శ్రేష్ఠమైనది అయినను, ప్రాణము పోయిన వెనుక ఆ స్త్రీశరీరము మిక్కిలి భయంకరమైన రూపముగలది యగును. పూర్వము అనుభవించి ఆనందించినవాడే అట్టి దానిని చూచి, మిక్కిలి దూరముగా పోవుచున్నాడు. ఓ మనసా! యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : ఆడంబరాన్ని ప్రదర్శించే సన్న్యాసులను నిందించుచున్నారు.

**నరవాహనగజతురగారూఢాః నారీసుతపోషణగుణగూఢాః ।**
**నానారంజకవిద్యాప్రౌఢా నాగరికాః కిం యతయో మూఢాః ॥26॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

(నర... రూఢాః), నరవాహన = పల్లకీలను, గజ = ఏనుగులను, తురగ = గుఱ్ఱములను, అరూఢాః = ఎక్కినవారలును, (నారీ... గూఢాః), నారీ = స్త్రీలను, సుత = కుమారులను, పోషణ = పోషించుటచేత, గుణ = గుణత్రయయందు, గూఢాః= రహస్య ప్రయత్నములు గలవారు, (నానా... ప్రౌఢాః), నానా = అనేకవిధములైన, రంజితవిద్యా= చమత్కారవిద్యలయందు, ప్రౌఢాః = సమర్థులైన, నాగరికాః = రసికులు, యతయః కిమ్ = యతులా? మూఢాః = మూఢులే.

తా॥ ఏనుగులను, గుఱ్ఱముల నెక్కిన వారలును, స్త్రీలను, కుమారులను

పోషించుటలో రహస్యప్రయత్నములు చేయువారును, అనేకవిధములైన చమత్కార విద్యలయందు సమర్థులైన రసికులును యతులా? వారు కేవలము మూఢులు సుమా! కావున, ఓ మనసా ! యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : **"న హి న హి రక్షతి డు కృఞ్-కరణే"** అను రీతిలో సామాన్య శాస్త్రముల అధ్యయనము మోక్షమునకు కారణము కాదనుచున్నారు.

**యస్య ముఖస్థా యతిపతిసూక్తి స్తస్య కరస్థా విలసతి ముక్తిః ।**
**నరకే పతితం నవనవయుక్తి ర్న హి రక్షతి సామాన్యనిరుక్తిః ॥ 27 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

యతిపతి = ఉడైయవరులయొక్క, సూక్తిః = శ్రీసూక్తి, యస్య = ఎవనియొక్క ముఖస్థా = ముఖమందున్నదో, ముక్తిః = మోక్షము, తస్య = అతనియొక్క (ఉడైయవరుల శ్రీసూక్తి ననుసంధించువారియొక్క), కరస్థా = హస్తమునందున్నదియై, విలసతి = ప్రకాశించుచున్నది, నవనవ = నూతనమైన, యుక్తిః = యుక్తులనుగల, సామాన్యనిరుక్తిః, హేతువుల దోషములను వివరించు సామాన్యనిరుక్తి అను తర్కగ్రంథము. నరక = నరమునందు, పతితం = పడినవానిని, న రక్షతి = కాపాడదుగదా!

తా॥ ఉడైయవరులయొక్క శ్రీసూక్తి ఎవని ముఖమందున్నదో మోక్షము అతనికి (ఉడైయవరుల శ్రీసూక్తి ననుసంధించువానికి) హస్తమునందు ప్రకాశించుచున్నది. సామాన్యనిరుక్తి అను తర్కగ్రంథము. నరకమునందు పడినవానిని కాపాడదు. కావున, ఓ మనసా ! యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : న్యాయాదిసామాన్య శాస్త్రములు మోక్షోపకారకములు కాకున్నను, మతాంతరులైన శంకరాదులు రచించిన భాష్యాదిగ్రంథములున్నవి గదా ! -అనినచో, వాటివల్ల ఏ ఉపయోగము లేదనుచున్నారు.

**శ్రుతిశిరసా మత్యంతవిదూష్యం సూత్రానభిమత మతివైదూష్యమ్ ।**
**ప్రథమమంగళ మనృతవిశేష్యం ప్రలపసి కిం ప్రాకృతకృతభాష్యమ్? ॥28 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

శ్రుతిశిరసాం = ఉపనిషత్తులకు, అత్యంతవిదూష్యం = మిక్కిలి దూషించదగినదియు, సూత్ర = బ్రహ్మసూత్రములకు, అనభితమ్ = సమ్మతము కానిదియు, అతివైదూష్యం = మిక్కిలి దోషములను కల్గినది, ప్రథమమ్ = మొదట, అమంగళము= మంగళాచరణ శ్లోకము లేనిదియు, అనృత = మిథ్యను, విశేష్యం = విశేష్యముగా గల్గినది అయిన (మాయావాదము), ప్రాకృతభాష్యమ్ = అజ్ఞుల భాష్యమును, ప్రలపసి కిం = చెప్పెదవా యేమి?.

తా॥ ఉపనిషత్తులకు మిక్కిలి విరుద్ధమైనది, బ్రహ్మసూత్రములకు సమ్మతము కానిదియు, పలు దోషములను కల్గినది. మొదట మంగళాచరణ శ్లోకము లేనిదియు, (మాయావాదము) మిథ్యావాదమును విశేష్యముగా గల్గినది అయిన అపరిశుద్ధభాష్యమును జెప్పెదవా ఏమి? ఓ మనసా !, యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : లోకములో ఎంతోమంది సన్న్యాసులు, అవధూతలు, తత్త్వబోధకులున్నారు, వారిని ఆశ్రయించవచ్చుగదా ! - అను మాటకు బదులిచ్చుచున్నారు.

**తస్కరజారవిదూషకధూర్తాః మస్కరమౌనిదిగంబరవృత్తాః ।**
**గుప్తసతీసుతధనమదమత్తాః గురవః కిం పరవంచకచిత్తాః ॥29 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

(తస్కర...ధూర్తాః), తస్కర = దొంగలు, జార= జారులు,విదూషకః= హాస్యగాండ్రు, ధూర్తాః= ధూర్తులు, (మస్కర... వృత్తాః), మస్కర = సన్న్యాసుల, మౌని = మునుల, దిగంబర = దిగంబరులయొక్క, వృత్తాః= వ్యాపారము గలవారలు, (గుప్త... మత్తాః), గుప్త = కాపాడబడిన, సతీ = భార్యలు, సుత = కుమారులు కలవారు, ధనమద = ద్రవ్యమదముచేత, మత్తాః= మదించినవారలగు, (పరవంచన చిత్తాః), పర=ఇతరులను, వంచన = మోసము చేయునట్టి, చిత్తాః= మనస్సు గలవారు, గురవః కిం= గురువులా ఏమి? (కానేకారో)

తా॥ దొంగలు, జారులు, హాస్యగాండ్రు, ధూర్తులు, సన్న్యాసులు, మునులు, దిగంబరులు, వ్యాపారము చేయువారు, భార్యలను, కుమారులకోసం పడరాని పాట్లుపడువారు, ద్రవ్యమదముచేత మదించినవారలు, ఇతరులను మోసము చేయునట్టి మనస్సు గలవారలు ఎట్లు గురువులగుదురు? కావున, ఓ మనసా ! యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : ఇట్టి వైభవమును కల శ్రీరామానుజులే ఉత్తారకాచార్యులనుట నిశ్చయముకనుక, **"స చాచార్యౌ వంశో జ్ఞేయః"** అను రీతిలో శ్రీరామానుజుల వంశానుక్రమణికను తెల్పుచున్నారు.

**కాంతిమతీసుకుమారకుమారం కేశవసింహకిశోర ముదారమ్ ।**
**రామానుజ మహిరాడవతారం మూకాంధానపి మోక్షయితారమ్ ॥ 30 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

కాంతిమతీ = కాంతిమతీదేవియొక్క, సుకుమార = సుకుమారుడైన, కుమారం= కుమారులైనవారును, కేశవసింహ = కేశవసోమయాజి యను శ్రేష్ఠునకు, కిశోరం = కుమారులైనవారును, ఉదారం = గొప్పవారును, మహిరాడవతారం = ఆదిశేషునియొక్క అవతారమైనవారును, మూకాంధానపి, మూక = మూగవారిని, అంధాన్+అపి = గుడ్డివారిని, మోక్షయితారం = మోక్షమును పొందించునట్టి వారును అగు, రామానుజం= ఉడైయవరులను, భజ = సేవించుము.

తా॥ కాంతిమతీదేవికి సుకుమారుడైన కుమారులైనవారును, కేశవ సోమయాజియను శ్రేష్ఠునకు కుమారులైనవారును, గొప్పవారును, ఆదిశేషునియొక్క అవతారమైనవారును, మూగవారికిని, గుడ్డివారికిని మోక్షమును ఇచ్చినవారును అగు ఉడైయవరులను సేవించుము. ఓ మనసా!, ఇట్టి ఘనకార్యములచే చేతనులను రక్షించునట్టి యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : శ్రీరామానుజులను ధ్యానించుటకు వీలుగా వారి దివ్యరూపమును రెండు శ్లోకములతో కనులముందు నిల్పుచున్నారు.

**కాషాయాంబరకవచితగాత్రం కలితకమండలుదండపవిత్రమ్ ।**
**విధృతశిఖాహరిణాజినసూత్రం వ్యాఖ్యాతద్వైపాయనసూత్రమ్ ॥ 31 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

(కాషాయాంబర... గాత్రం), కాషాయాంబర = కాషాయవస్త్రమచేత, కవచిత= కప్పబడిన, గాత్రము = శరీరము గలవారును, కలిత = కూడుకొనిన, కమండలు = కమండలమును, దండ = త్రిదండమును, పవిత్రం = పవిత్రమును గలవారును, విధృత = ధరింపబడిన, శిఖా = శిఖయు, హరిణాజిన = కృష్ణాజినమును, సూత్రం = యజ్ఞోపవీతము గలవారును, వాఖ్యాత = వ్యాఖ్యానము చేయబడిన, ద్వైపాయన సూత్రమ్= వ్యాససూత్రములు కలవారగు (ఉడైయవరులను) భజ = సేవించుము.



తా॥ శరీరముపైన కవచరూపముగా కాషాయముచే కప్పబడిన వారు, శిఖాయజ్ఞోప వీతములను ధరించినవారును, శ్రీహస్తమున కమండలము ధరించినవారును, కృష్ణాజినమును కలిగినవారును, వ్యాససూత్రములకు వ్యాఖ్యానము చేసినవారైన ఉడైయవరులను ఓ మనసా ! సేవించుము, సేవించుము, సేవించుము.

**యామునపూర్ణకృపోజ్జ్వలగాత్రం రామాబ్జాక్షమునీక్షణపాత్రమ్ ।**
**కోమలశఠరిపుపదయుగమాత్రం శ్రీమాధవసేనాపతిమిత్రమ్ ॥ 32 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

యామున = యామునాచార్యులవారి యొక్క, పూర్ణ = పూర్ణమైన, కృపా = దయచేత, ఉజ్జ్వల = ప్రకాశించునట్టి, గాత్రమ్ = శరీరము గలవారును, (రామా... పాత్రమ్), రామ = శ్రీరామమిశ్రులు, అబ్జాక్ష = పుండరీకాక్షులు– అను, ముని= మునులయొక్క, ఈక్షణ = కటాక్షమునకు, పాత్రం = పాత్రులైనవారును, (కోమల... మాత్రమ్), కోమల = సుకుమారములైన, శఠరిపు =నమ్మాళ్వారులయొక్క, పదయుగమాత్రం = పాదములైనవారు, (శ్రీమాధవ... మిత్రం), శ్రీ= సంపత్కరమైన, మాధవ = పెరుమాళ్లయొక్క, సేనా = సైన్యమునకు, పతి = ప్రభువు (సేనాపతి జియ్యర్ అనువారికి), మిత్రం = మిత్రులైన ఉడైయవరులను, భజ = సేవింపుము.

తా॥ యామునాచార్యుల వారియొక్క పూర్ణమైన దయచేత ప్రకాశించునట్టి శరీరము గలవారును, శ్రీరామమిశ్రులు, పుండరీకాక్షులు– అను మునుల (ఆచార్యుల) యొక్క కటాక్షమునకు పాత్రులైనవారును, సుకుమారులైన నమ్మాళ్వారులయొక్క పాదముల జంటగా నున్నవారున్ను, సంపత్కరమైన పెరుమాళ్లయొక్క సైన్యమునకు ప్రభువైన సేనాపతి విష్వక్సేనునకు మిత్రులైన (వారి అంశభూతులైన) ఉడయవరులను సేవించుము, సేవించుము, సేవించుము.

**"కాషాయశోభి కమనీయశిఖానివేశం దండత్రయోజ్జ్వలకరం విమలోపవీతమ్,**

**ఉద్యద్దినేశ నిభ ముల్లసదూర్ధ్వపుండ్రం రూపం తవాస్తు యతిరాజ దృశోర్మమాగ్రే"** అను శ్లోకము అనుసంధేయము.

శ్రీరామానుజులకు ముందున్న, తరువాతగల ఆచార్యులందఱు వారికి అంగభూతులన విషయమును తెలుపు శ్లోకములు ఈ క్రింద నివేదింపబడుచున్నవి.

**మస్తకం శ్రీశఠారాతిః నాథాఖ్యం ముఖమండలమ్ ।**
**నేత్రయుగ్మం సరోజాక్షం కపోలం రాఘవం తథా ॥**

శ్రీరామానుజులకు నమ్మాళ్వారు – శిరస్సు, నాథమునులు – ముఖము, పుండరీకాక్షులు – నేత్రములు, శ్రీరామమిశ్రులు– గండస్థలము.

**వక్షఃస్థలం యామునాఖ్యం కంఠం శ్రీపూర్ణదేశికమ్ ।**
**బాహుద్వయం శైలపూర్ణం గోష్ఠీపూర్ణం స్తనద్వయమ్ ॥**

యామునాచార్యులు– వక్షఃస్థలము, పెరియనంబి – కంఠము, తిరుక్కచ్చినంబి– బాహువులు, తిరుక్కోట్టియూర్‌నమ్బి – స్తనములు.

**కుక్షిం తు వరరంగార్యం పృష్ఠం మాలాధరం తథా ।**
**కటిం కాంచీమునిం చైవ గోవిందార్యం నితంబకమ్ ॥**

తిరువరంగ ప్పెరుమాళరైయర్ – ఉదరము, తిరుమాలైయాణ్డాన్ – వీపును, తిరుక్కచ్చినంబి – నడుము, ఎమ్బార్ – పిఱుదులు.

**భట్టవేదాంతినౌ జంఘే ఊరుయుగ్మం తు మత్సుతమ్ ।**
**జానుద్వయం తు కృష్ణాఖ్యం లోకార్యం పాదపంకజమ్ ॥**

శ్రీభట్టరును, నంజీయరును – పిక్కలు, నమ్బిళ్లై – తొడలు, వడక్కుత్తిరు వీధిపిళ్లై– జానువులు, పిళ్లైలోకాచార్యర్ – పాదములు.

**రేఖాం శ్రీశైలనాథాఖ్యం పాదుకాం వరయోగినమ్ ।**
**పుండ్రం సేనాపతిం ప్రోక్తం సూత్రం కూరపతిం తథా ॥**

తిరువాయ్‌మొழி పిళ్లై – పాదరేఖయు, మణవాళమహామునులు – శ్రీపాదులకలు, సేనాపతి జియ్యర్ – ఊర్ధ్వపుండ్రము, కూరత్తాழ్వాన్ – యజ్ఞోపవీతమును,



**భాగినేయం త్రిదండం చ కాషాయం చాంధ్రపూర్ణకమ్ ।**
**మాలాం చ కురుకేశార్యం ఛాయాం శ్రీచాపకింకరమ్ ॥**

ముదలియాణ్డాన్ – త్రిదండము, వడుగనంబి – కాషాయము, తిరుక్కురుగైప్పి రాన్‌పిళ్లై = తోమాలికయును (పుష్పమాలిక), పిళ్లైయుఱంగా విల్లిదాసర్ – నీడయును.

అవ : **"పేఱొన్ఱు మఱ్ఱిల్లై నిన్ శరణన్ఱి, అప్పేఱళిత్తఱ్కు ఆఱొన్ఱుమిల్లై మఱ్ఱచ్చరణన్ఱి"** అని,**"ఉపాయోపేయభూతశ్చ లక్ష్మణార్యో జగద్గురుః"** అనురీతిలో సర్వోత్కృష్టమైన ఉపాయము, ఉపేయము శ్రీరామానుజులే అనుచున్నారు.

**సాలగ్రామే సర్వహితార్థం యేనాస్థాపి గురోః పదతీర్థమ్ ।**
**తత్కులదైవత మిహ పురుషార్థం సకలోపాయాధికచరమార్థమ్ ॥ 33 ॥**
**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

సాలగ్రామే = సాలగ్రామ క్షేత్రమునందు, సర్వహితార్థం = అందఱి మేలుకొరకు, గురోః = ఆచార్యులైన ఉడైయవరులయొక్క, పదతీర్థం = శ్రీపాదతీర్థమును, యేన = ఎవరిచేత (ఆంధ్రపూర్ణులచేత), అస్థాపి = నిలుపబడెనో, (తత్ కులదైవతమ్), తత్ కుల = ఆ ఆంధ్రపూర్ణకులమునకు, దైవతమ్ = దైవమైన, (కులదైవమైన ఉడైయవరులను గూర్చి), ఇహ = ఇప్పుడు, (సకల.... చరమార్థమ్), సకల= సమస్తమైన, ఉపాయ = ఉపాయములకంటె, (జ్ఞాన, భక్తి, ప్రపత్తులకంటె), అధిక = అధికమైన, చరమార్థమ్ =కడపటి, అర్థమైన, పురుషార్థమ్ = పురుషార్థమును గూర్చి, (శ్రీరామానుజులను గూర్చి) భజ = సేవించుము.

తా॥ సాలగ్రామ క్షేత్రమందు అందఱి మేలుకొరకు ఆచార్యులైన ఉడైయ వరులయొక్క శ్రీపాదతీర్థము ఆంధ్రపూర్ణులచేత జేర్పబడినది. అట్టి ఆంధ్రపూర్ణుల కులమునకు దైవమైన ఉడైయవరులను గూర్చి ఇప్పుడు సమస్తమైన ఉపాయములకంటే– అనగా– జ్ఞాన, భక్తి, ప్రపత్తులకంటే– అధికమైన, కడపటి అర్థమైన పురుషార్థమునుగూర్చి, ఓ మనసా! యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : కర్మజ్ఞానాదులకంటే విలక్షణములైన ప్రవచనాదులు సైతం మోక్షపాయ ములు కావు, **"నాయమాత్మా ప్రవచనేన లభ్యః"** అను సిద్ధాంతమును శ్రీరామానుజుల పరముగా అన్వయించి పల్కుచున్నారు.

**ప్రవచనశక్తః ప్రజ్ఞాయుక్తః పరహితసక్తః పరమవిరక్తః ।**
**నానాదైవతభక్తోఽప్యుక్తో న భవతి ముక్తో న భవతి ముక్తః ॥ 34 ॥**

**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

ప్రవచన = బాగుగా మాటాడుటయందు, శక్తః = సమర్థుడును, ప్రజ్ఞా = జ్ఞానముతోటి, యుక్తః = కూడినవాడును, పరహిత= పరులకు మేలుచేయుటయందు, సక్తః = ఆసక్తి కలవాడును–అని, ఉక్తః = ఇట్లు జెప్పబడినవాడు, నానాదైవత = అనేక దైవములయందు, భక్తః+అపి = భక్తిని గలవాడైనప్పటికిన్ని, ముక్తః=ముక్తుడు, న భవతి= కాదు.

తా॥ బాగుగా మాటాడుటయందు సమర్థుడును, జ్ఞానమును కలవాడును, పరులకు మేలు చేయుటయందు ఆసక్తి కలవాడును, పరమవైరాగ్యము గలవాడును–అయినను అనేక దైవములయందు భక్తి గలవాడైనచో ముక్తుడు కాలేడు. కావున ఓ మనసా! యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : ఈగ్రంథ ప్రధానప్రమేయమైన "శ్రీరామానుజులే ఉత్తారకోపాయము, వారికైంకర్యమే పరమపురుషార్థ"మను విషయమును స్పష్టముగా, శపథపూర్వకముగా ఉపపాదించుచున్నారు.

**సంత్యజ సకల ముపాయాచరణం వ్రజ రామానుజచరణౌ శరణమ్ ।**
**పశ్యసి తమసః పారం నిత్యం సత్యం సత్యం పునరపి సత్యమ్ ॥ 35 ॥**

**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

సకలం = సమస్తమైన, ఉపాయ+ఆచరణ = ఉపాయముల నాచరించుటను, సంత్యజ = వదలిపెట్టుము, రామానుజచరణౌ = ఉడైయవరుల తిరువడిగళ్లను, శరణం= రక్షకముగ, వ్రజ = పొందుము, (అపుడు), తమసః = అజ్ఞానముయొక్క, పారం = ఒడ్డును, నిత్యం = సర్వదా, పశ్యసి = చూడగలవు, సత్యం సత్యం = నిజము, నిజము, పునరపి సత్యం = ఇంకయును నిజము.

తా॥ సమస్తమైన ఉపాయముల నాచరించుటను వదలిపెట్టుము. ఉడైయవరుల తిరువడిగళ్లనే రక్షముగా పొందుము. అపుడు జ్ఞానముయొక్క ఒడ్డును సర్వదా చూడగలవు. నిజము, నిజము, ఇంకయును నిజము. కావున, ఓ మనసా! యతిరాజులను



సేవించుము, సేవించుము, సేవించుము.

అవ : చివరిగా గ్రంథకర్త తమ గోత్రనామాదులను ఉట్టంకించుచు గ్రంథమును ముగించుచున్నారు.

**భగవద్రామానుజ షడ్త్రింశ త్సాలగ్రామ గురూత్తమవంశః ।**
**కౌండిన్యః కవి రాహ పవిత్రం రంగార్యో యతిరాజస్తోత్రమ్! ॥**
**భజ యతిరాజం, భజ యతిరాజం, భజ యతిరాజం భవభీరో! ॥36॥**

**భజ యతిరాజం భజ యతిరాజం భజ యతిరాజం భవభీరో!**

(సాలగ్రామగురూత్తమవంశః), సాలగ్రామగురు = ఆంధ్రపూర్ణులయొక్క, ఉత్తమ వంశః = ఉత్తమవంశమందుబుట్టిన, కౌండిన్యః= కౌండిన్యగోత్రజుడగు, రంగార్యః = రంగార్యుడను పేరు గల, కవిః = కవి, యతిరాజ = ఉడైయవరులయొక్క, స్తోత్రం= స్తోత్రమును, ఆహ = చెప్పెను.

తా॥ ఆంధ్రపూర్ణులయొక్క ఉత్తమవంశమందు పుట్టినవారు, కౌండిన్య గోత్రజులగు రంగార్యులను పేరు గల కవి ఉడైయవరులయొక్క స్తోత్రమును జెప్పిరి. కావున, ఓ మనసా! అట్టి యతిరాజులను సేవించుము, సేవించుము, సేవించుము.

**ఇతి శ్రీమత్సాలగ్రామస్థలాచార్య పురుషోద్దండవేదాంతరంగనాథాచార్య విరచిత**
**భజయతిరాజస్తోత్రం సంపూర్ణమ్**

**భజయతిరాజస్తోత్రం సాలగ్రామాభిజనగురుప్రోక్తమ్ ।**
**వ్యవృణోదాంధ్ర్యాం యతిరాట్దాసః శ్రీశింగరాచార్యః ॥**

**శ్రీఎమ్బెరుమానార్ దివ్యతిరువడిగళే శరణమ్**



# ధాటీపంచకము

( భగవద్రామానుజులు వైభవాన్ని తెలిపే స్తుతి, ఇది. దీనిని దాశరథి అనబడే భగవద్రామానుజుల మేనల్లుడు, వారి శిష్యులు ముదలియాణ్డాన్ రచించారు. )

**1. పాషణ్డద్రుమషండ దావదహనః చార్వాకశైలాశనిః**
**బౌద్ధధ్వాంత నిరాసవాసరపతిః జైనేభకంఠీరవః ।**
**మాయావాది భుజంగభంగ గరుడః త్రైవిద్యచూడామణిః**
**శ్రీరంగేశజయధ్వజో విజయతే రామానుజోఽయం మునిః ॥**

పాషండద్రుమషండదావదహనః = పాషండమతస్థులనే వృక్షాలకు కాఋచిచ్చు వంటివారు, చార్వాకశైలాశనిః = చార్వాకులనే పర్వతాలకు వజ్రాయుధం వంటివారు, బౌద్ధధ్వాంత = బౌద్ధులనే చీకటిని పోగొట్టే, వాసరపతిః = సూర్యునివంటివారు, జైనేభకంఠీరవః = జైనులనే మదగజాలకు సింహంవంటివారు, మాయావాది = మాయా వాదులనబడే (అద్వైతులు), భుజంగభంగ = సర్పాలను భంగపరచే, గరుడః = గరుడుని వంటివారు, త్రైవిద్యచూడామణిః = పరమవైదికుల శిరస్సులను అలంకరించే చూడామణి వంటివారు, శ్రీరంగేశజయధ్వజః = శ్రీరంగనాథుని కీర్తికి ధ్వజపతాకంవంటివారు అయిన, అయం రామానుజః మునిః = ఈ భగవద్రామానుజమునులు, విజయతే= సర్వోత్కర్షతో ప్రకాశిస్తున్నారు.

**2. పాషండషండ గిరిఖండన వజ్రదండాః**
**ప్రచ్ఛన్నబౌద్ధ మకరాలయ మంథదండాః ।**
**వేదాంతసార సుఖదర్శనదీపదండాః**
**రామానుజస్య విలసంతి మునే స్త్రిదండాః ॥**

పాషండషండగిరిఖండన = పాషండమతస్థుల సమూహాలు అనే పర్వతాలను ఖండించడంలో, వజ్రదండాః = వజ్రదండంవంటివి, ప్రచ్ఛన్నబౌద్ధ = ముసుగు వేసికొన్న బౌద్ధులుగా చెప్పబడే అద్వైతులనే, మకరాలయ = సముద్రానికి, మంథదండాః= మథించే కవ్వంవంటివి, వేదాంతసార = వేదాంతాలలోని సారాన్ని, సుఖదర్శన = సుఖంగా దర్శించడంలో, దీపదండాః = దివ్విటీలవంటివి అయిన, రామానుజస్య మునేః = భగవద్రామానుజమునుల, త్రిదండాః = త్రిదండం, విలసంతి = ప్రకాశిస్తున్నవి.

**3. చారిత్రోద్ధారదండం చతురనయపదాలంక్రియా కేతుదండం**



**సద్విద్యాదీపదండం సకలకలికథాసంహృతేః కాలదండమ్ ।**
**త్రయ్యంతాలంబదండం త్రిభువనవిజయ చ్ఛత్రసౌవర్ణదండం**
**ధత్తే రామానుజార్యః ప్రతికథకశిరోవజ్రదండం త్రిదండమ్ ॥**

చారిత్ర+ఉద్ధారదండం = చక్కని నడవడికను అలవాటు చేసి, వృద్ధిపొందించే బెత్తంవంటిది, చతుర నయపదాలంక్రియా కేతుదండం = వేదశాస్త్రమార్గాన్ని అలంకరించే ధ్వజస్తంభంవంటిది. సద్విద్యాదీపదండం = సద్విద్య మొదలైన బ్రహ్మవిద్యలను చక్కగా వ్యక్తం చేయ గల దీపదండంవంటిది, సకలకలికథాసంహృతేః కాలదండం= అన్ని విధాలైన కలికోలాహలాలను లేకుండా చేయగల యమదండంవంటిది, త్రయ్యంతా లంబదండం = వేదాంతాలకు ఆధారదండంవంటిది, త్రిభువన విజయచ్ఛత్ర సౌవర్ణదండం = ముల్లోకాలను జయించి నాటిన ఛత్రానికి సువర్ణస్తంభంవంటిది, ప్రతికథకశిరో వజ్రదండం = ప్రతివాదుల శిరస్సులను బ్రద్దలు చేయగల వజ్రదండం వంటిది అయిన, త్రిదండం = త్రిందడాన్ని, రామానుజార్యః ధత్తే = భగవద్రామానుజులు ధరించి ఉన్నారు.

**4. త్రయ్యా మాంగల్యసూత్రం త్రియుగపద యుగారోహణాలంబసూత్రం**
**సద్విద్యాదీపసూత్రం సకలకలికథా సంహృతేః కాలసూత్రమ్ ।**
**ప్రజ్ఞాసూత్రం బుధానాం ప్రశమథనమనఃపద్మినీనాళసూత్రం**
**రక్షాసూత్రం మునీనాం జయతి యతిపతేః వక్షసి బ్రహ్మసూత్రమ్ ॥**

త్రయ్యామాంగల్యసూత్రం = వేదం అనే కాంతకు మంగళసూత్రంవంటిది, త్రియుగపదయుగారోహణాలంబసూత్రం = జ్ఞానం, శక్తి మొదలైన ఆఋ ముఖ్యగుణాలను కల షాడ్గుణ్యపూర్ణుడైన భగవానుని శ్రీపాదాలను ఆశ్రయించడానికి తగిన ఆలంబన సూత్రం వంటిది, సద్విద్యాదీపసూత్రం – సద్విద్య అనే (ఉపనిషద్విద్య) దీపానికి సూత్రం (వత్తి) వంటిది, సకలకలికథాసంహృతేః = అన్ని విధాలైన కలిపురుషుని కోలాహలాలను నిరసించే, కాలసూత్రం = యమపాశంవంటిది, బుధానాం ప్రజ్ఞాసూత్రమ్ = విద్వాంసుల మేధస్సును ప్రకాశింపజేసే మీమాంసాసూత్రంవంటిది, ప్రశమథనమనః పద్మినీనాళ సూత్రం = యోగుల చిత్తం అనే తామరతటాకంలోని తామరలకు ఆధారభూతం అయిన తూడు (నాళసూత్రం) వంటిది అయిన, యతిపతేః వక్షసి బ్రహ్మసూత్రమ్ = శ్రీరామానుజుల వక్షఃస్థలంలోని యజ్ఞోపవీతం, జయతి = సర్వోత్కర్షతో వెలుగు తున్నది.

**5. పాషండసాగర మహాబడబాముఖాగ్నిః శ్రీరంగరాజచరణాంబుజ మూలదాసః ।**

**శ్రీవిష్ణులోకమణిమంటప మార్గదాయీ రామానుజో విజయతే యతిరాజరాజః ॥**

పాషండసాగర మహాబడబాముఖాగ్నిః = పాషండులనే మహాసముద్రాన్ని ఇంకింప జేసే బడబాగ్నివంటివారు, శ్రీరంగరాజ చరణాంబుజమూలదాసః = శ్రీరంగనాథుని శ్రీపాదపద్మాల మూలంలో దాసభూతులైనవారు, శ్రీవిష్ణులోక మణిమంటప మార్గ దాయీ= పరమపదంలోని తిరుమామణిమంటపం చేరడానికి మార్గాన్ని అనుగ్రహించే వారు, యతిరాజరాజః = యతిసార్వభౌములు అయిన, రామానుజః విజయతే = భగవద్రామానుజులు సర్వోత్కర్షతో వెలుగుతున్నారు.

# ప్రార్థనాపంచకము

**1. యతీశ్వర! శ్రుణు శ్రీమన్! కృపయా పరయా తవ ।**
**మమ విజ్ఞాపన మిదం విలోక్య వరదం గురుమ్ ॥**

శ్రీమన్ = ఉభయవిభూతులను నిత్యంగా కల్గిన, యతీశ్వర! = యతులకు ఈశ్వరులైన శ్రీరామానుజా!, వరదం గురుమ్ = వరదులనే ఆచార్యులను, విలోక్య = కటాక్షించి, తవ పరయా కృపయా = మీకే అసాధారణం అయిన గొప్ప కృపతో, మమ= నాయొక్క, ఇదం విజ్ఞాపనమ్ = ఈ విన్నపాన్ని, శ్రుణు = ఆలకించు.

**2. అనాదిపాపరచితా మంతఃకరణనిష్ఠితామ్ ।**
**యతీంద్ర! విషయే సాంద్రాం వినిర్వాసయ వాసనామ్ ॥**

యతీంద్ర=యతిరాజా !, అనాదిపాపరచితాం = మొదలు తెలియని, చిరకాలంగా చేస్తున్న పాపాలచేత సంభవించినది, అంతఃకరణనిష్ఠితాం = అంతరింద్రియం అనే మనస్సులో స్థిరంగా ఉండేది, విషయే = స్వరూపానికి తగని బాహ్యవిషయాలలోగల, సాంద్రాం = దట్టమైన, వాసనాం = సంగాన్ని, వినివర్తయ = తొలగించాలి.

**3. అపి ప్రార్థయమానానాం పుత్రక్షేత్రాదిసంపదమ్ ।**
**కురు వైరాగ్యమేవాత్ర హితకారిన్! యతీంద్ర నః ॥**

హితకారిన్ = హితాన్ని చేసే, యతీంద్ర = యతీశ్వరా!, పుత్రక్షేత్రాది సంపదమ్= పుత్రసంతానం, భూమి మొదలైన లౌకికసంపదను, ప్రార్థయమానానామ్ అపి = మీవద్ద దాసులమైన మేము ప్రార్థించినవారమైనా, నః = మాకు, అత్ర = ఈ పుత్రక్షేత్రాదుల విషయంలో, వైరాగ్య మేవ = విరక్తినే, కురు = కలుగజేయాలి.

**4. యథాపరాధాః న స్యు ర్మే భక్తేషు భగవత్యపి ।**
**తథా లక్ష్మణయోగీంద్ర! యావద్దేహం ప్రవర్తయ ॥**

లక్ష్మణయోగీంద్ర =శ్రీరామానుజయోగీంద్రా!, మే = (మీ) దాసుడనైన నాకు, భక్తేషు = భాగవతులపట్ల, భగవతి+ అపి = భగవానునిపట్లను, అపరాధాః = అపచారాలు, యథా న స్యుః తథా = కలగని రీతిలో, యావద్దేహం = దేహం ఉన్నంతకాలం, ప్రవర్తయ = నన్ను నడిపించాలి.

**5. ఆమోక్షం లక్ష్మణార్య! త్వత్ప్రబంధపరిశీలనైః ।**
**కాలక్షేపోఽస్తు న స్సద్భి స్సహవాస ముపేయుషామ్ ॥**

లక్ష్మణార్య = శ్రీరామానుజార్యా !, ఆమోక్షం =మోక్షాన్ని పొందేంతవరకు, నః = దాసులమైన మాకు, సద్భిః = సత్పురుషులతో, సహవాసం = కలసి నివసించడాన్ని, ఉపేయుషాం (సతాం) = పొందినవారమై, త్వత్ ప్రబంధ పరిశీలనైః = తాము అనుగ్రహించిన సద్గ్రంథాలను పరిశీలనచేయడం ద్వారా, కాలక్షేపః = పొద్దును సరి అయిన రీతిలో నడపడం, అస్తు = కలుగుగాక.

**6. పరాంకుశ మునీంద్రాది పరమాచార్యసూక్తయః ।**
**స్వదంతాం మమ జిహ్వాయై స్వత ఏవ యతీశ్వర ! ॥**

యతీశ్వర = యతిరాజా!, పరాంకుశ = పరాంకుశులనబడే, మునీంద్ర = మునిశ్రేష్ఠులైన నమ్మాళ్వార్లు, ఆది= మొదలైన, పరమాచార్య = పరమాచార్యుల, సూక్తయః = **"శెవిక్కినియ శెజ్ఞొల్"** అనదగిన శ్రీసూక్తులు, స్వతః ఏవ = సహజంగానే, (తమకు తామే), మమ జిహ్వాయై = దాసుని జిహ్వకు, స్వదంతామ్ = రుచించుగాక!

**7. ఇత్యేతత్ సాదరం విద్వాన్ ప్రార్థనాపంచకం పఠన్ ।**
**ప్రాప్నుయాత్ పరమాం భక్తిం యతిరాజపదాబ్జయోః ॥**

ఇతి =పూర్వోక్తప్రకారంగా, ఏతత్ =ఈ, ప్రార్థనాపంచకం =అయిదు శ్లోకాల రూపం లోని ప్రార్థనలను వ్యక్తం చేసే స్తోత్రాన్ని, సాదరం = ప్రేమతో, పఠన్ = అనుసంధించే, విద్వాన్ = జ్ఞానం కలవాడు, యతిరాజపద+అబ్జయోః= భగవద్రామా నుజుల శ్రీచరణార విందాలలో, పరమాం భక్తిం = మిక్కిలి గొప్ప భక్తిని, ప్రాప్నుయాత్= పొందగలడు.

# శ్రీరామానుజ చతుఃశ్లోకి

(శ్రీరంగం, తిరుమల, పెరుమాళ్ కోయిల్ (కంచి), తిరునారాయణపురం (మేల్కోటై) – అనే నాల్గు దివ్య దేశాలలోను భగవద్రామానుజుల విజయానికి మంగళాన్ని ఆశాసిస్తున్నాయి – ఈ నాల్గు శ్లోకాలు. దీనిని అనంతార్యులు రచించారు.)

**1) అనిశం భజతామనన్యభుజాం చరణాంభోరుహ మాదరేణ పుంసామ్ ।**
**వితరన్ నియతం విభూతిమిష్టాం జయ రామానుజ! రంగధామ్ని నిత్యమ్ ॥**

భగవద్రామానుజా! మీ చరణారవిందాలను ఎల్లప్పుడు ఆశ్రయించి ఉండే అనన్యగతికులైన దాసులకు ఏ విభూతి అభీష్టమో, ఆ విభూతిని నియతంగా అనుగ్రహిస్తూ, శ్రీరంగంలో మీరు నిత్యం విజయాన్ని పొందాలి.

**2) భువినో విమతాన్ త్వదీయసూక్తిః కులిశీభూయ కుదృష్టిభి స్సమేతాన్ ।**
**శకలీకురుతే విపశ్చితీడ్యా జయ రామానుజ! శేషశైలశృంగే ॥**

భగవద్రామానుజా! విద్వాంసులు పొగడతగిన మీ శ్రీసూక్తి వజ్రాయుధంవంటిది. అది భూమిలో ఉండే కుదృష్టులతోపాటు ప్రతివాదులను అందఱిని చూర్ణం చేస్తున్నది. (ఇటువంటి గొప్పతనాన్ని కల శ్రీసూక్తులను అనుగ్రహించిన) మీరు వేంకటాద్రిశిఖరంపై నిత్యశ్రీఃనిత్యమంగళంగా వర్ధిల్లాలి.

**3) శ్రుతిషు స్మృతిషు ప్రమాణతత్త్వం కృపయాలోచ్య విశుద్ధయా హి బుద్ధ్యా।**
**అకృథాః స్వత ఏవ భాష్యరత్నం జయ రామానుజ! హస్తిధామ్ని నిత్యమ్ ॥**

భగవద్రామానుజా! నిర్హేతుకకృపతో శ్రుతిస్మృతులలోని ప్రమాణాల యథార్థాన్ని గ్రహించి, విశుద్ధమైన బుద్ధితో చాలా గొప్పదైన శ్రీభాష్యాన్ని అనుగ్రహించారు. ఇటువంటి మీరు శ్రీహస్తిగిరిలో నిత్యంగా వర్ధిల్లాలి.

**4) జయ మాయిమతాంధకారభానో! జయ బాహ్యప్రముఖాటవీకృశానో! ।**
**జయ సంశ్రితసింధుశీతభానో! జయ రామానుజ! యాదవాద్రిశృంగే ॥**

మాయావాదుల మతాలు అనే చీకటికి సూర్యునివంటివాడా! వేదబాహ్యులు మొదలైనవారు అనే అడవికి కార్చిచ్చువంటివాడా! భక్తులనే సముద్రాన్ని ఉప్పొంగించే చంద్రునివంటివాడా! శ్రీరామానుజా! మీరు యాదవాద్రిలో నిత్యం వర్ధిల్లాలి.



**5) రామానుజచతుఃశ్లోకీం యః పఠేన్నియత స్సదా ।**
**ప్రాప్నుయాత్ పరమాం భక్తిం యతిరాజపదాబ్జయోః ॥**

భక్తులకు నిత్యానుసంధేయంగా నియమింపబడ్డ ఈ రామానుజ చతుఃశ్లోకిని నియమంతో నిత్యానుసంధానం చేసేవారు భగవద్రామానుజుల శ్రీచరణపద్మాలలో గొప్ప భక్తిని ప్రత్యక్షఫలంగా పొందుతారు.





# మంగళాశాసనము

భారతీయ వాఙ్మయంలో స్తోత్రసాహిత్యం అత్యంత ప్రాచీనమైనది. వేదాలలో మొదటివేదంగా పరిగణింపబడే ఋగ్వేదం పలుదేవతల స్తోత్రాల సమాహారం. ఈ స్తుతులలో అనిష్టనివృత్తి, ఇష్టప్రాపణల ప్రార్థన ప్రధానంగా కనిపించినా, అంతర్లీనంగా ఎన్నో తత్త్వాలు ఇమిడి ఉన్నాయని విజ్ఞులైన వ్యాఖ్యాతలు వివరించారు. ఈ స్తోత్రప్రక్రియ ఉపబృంహణాలైన పురాణేతిహాసాదులలో కూడా విరివిగా కన్పిస్తుంది. వీటిలో ఎన్నో మధురమైన స్తోత్రాలు మనకు లభిస్తున్నాయి. శ్రీవైష్ణవ సంప్రదాయానికి చెందిన పలువురు పూర్వాచార్యులు మనకు అమూల్యమైన స్తోత్రవాఙ్మయాన్ని ప్రసాదించారు. అవి అన్నీ పరమవైదికమైన విశిష్టాద్వైత సిద్ధాంత తత్త్వాలను హృదయంగమంగా అందిస్తున్నాయి. వీటిలో కొన్ని స్తోత్రాలకు విశదమైన వ్యాఖ్యానాలు కూడా వెలిశాయి.

ప్రపన్నుడు నిత్యం అనుసంధించుకోవలసిన స్తోత్రాలను సమీకరించి, **"శ్రీపతి స్తుతిమాల"** అనే సద్గ్రంథరూపంలో ముద్రించి మనకందరికీ మహోపకారం చేసిన మహనీయులు శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్నశ్రీమన్నారాయణ రామానుజ జీయర్ స్వామి వారు. ఈ గ్రంథం నుండి కొన్ని స్తుతులు ప్రస్తుతం తాత్పర్యసహితంగా **"ప్రపన్న స్తోత్రమాలిక"** అనేపేరుతో ముద్రించి భక్తులకు అందజేసే కైంకర్యాన్ని చేసుకొనే భాగ్యాన్ని నోచుకున్న అదృష్టశాలి శ్రీమాన్ పొన్నాడ మధుసూదన రామానుజ దాసుగారు. వీరితో నాకు సుమారు నాలుగైదు సంవత్సరాల పరిచయం. వీరి వ్యక్తిత్వం, సంప్రదాయ శ్రద్ధ ఎన్నదగినది. నా విషయంలో గౌరవాభిమానాలను కలవారు. తమ కనిష్ఠ కుమార్తె **చి॥ల॥సౌ॥ పద్మజ వివాహ సందర్భంగా** వీరు చేసే ఈ సద్గ్రంథ ప్రచురణ ప్రశంసనీయమైనది. వీరిని ఈ ప్రయత్నంలో ప్రోత్సహించి సహకరించిన వీరి ధర్మపత్ని శ్రీమతి జనార్దనమ్మ, వీరి తల్లిదండ్రులు శ్రీమతి మాణిక్యమమ్మ, శ్రీమాన్ జగన్నాథరామానుజ దాసు దంపతులు, వీరి కుమారుడు చి॥ మురళి అభినందనీయులు. ఈ సద్గ్రంథాన్ని ప్రచురించి వితరణ చేస్తున్న **శ్రీమతి & శ్రీమాన్ మధుసూదనదాసు** దంపతులకు అనేక మంగళాశాసనములు. వధూవరులైన **చి॥ల॥సౌ॥ పద్మజ, శ్రీ గౌతమ్‌లకు** నా హృదయపూర్వక శుభాశీస్సులు. పద్మావతీదేవీసమేత శ్రీనివాసప్రభువు అనుగ్రహంవల్ల వీరికందరికీ సమస్త సన్మంగళాలు కలగాలని, భవిష్యత్తులో శ్రీరామానుజ సంప్రదాయానికి ఇతోధికంగా సేవ చేసే భాగ్యం కలగాలని మనసారా కోరుకుంటున్నాను. స్వస్తి.

ఇట్లు

**ఈ.ఏ. శింగరాచార్యులు**

# విజ్ఞాపనము

**భగవద్బంధువులారా!**

మన వేదవాఙ్మయములో స్తోత్రసాహిత్యానికి అత్యున్నతమైన స్థానమున్నది. సకలకల్యాణగుణాఢ్యుడైన శ్రియఃపతిని కీర్తించడానికే విజ్ఞాన నిధులైన మన మహర్షులు, పూర్వాచార్యులు పురాణవాఙ్మయములో లలిత మధురముపైన అనేక స్తుతులను పొందు పరిచారు. శ్రీమన్నారాయణుని గుణానుభవములో మునిగి తరించినవారు, పరమ ప్రామాణికులు అయిన మన పూర్వాచార్యులు అపారమైన స్తోత్రవాఙ్మయమును మనకందించారు. ఇటువంటి స్తోత్రములన్నింటినీ పొందుపరచి మన **శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్నశ్రీమన్నారాయణ రామానుజ జీయరుస్వామివారు** మనందరినీ తరింపజేయుటకు **'శ్రీపతి స్తుతిమాల'** అనే స్తోత్ర రాజమును మనకందించారు. అందులోనుండి కొన్నింటిని, మరియు **ఉభయవేదాంత విద్వన్మణి శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యుల** వారు టీకా తాత్పర్య సహితముగా అందించిన స్తోత్రములను కొన్నింటిని ఈ స్తోత్రమాలలో అందించడమైనది. **చిన్నజీయరుస్వామి వారి శిష్యురాలైన మా కనిష్ఠపుత్రిక చి॥ల॥కు॥ పద్మజ** వివాహ శుభసందర్భముగా చేస్తున్న ఈ చిరుప్రయత్నమును మీరు ఆమోదించి సద్వినియోగపరచుకుని తరింప గోరుచున్నాము.

వ్యవసాయమే పరమధర్మంగా భావించి అనేకమంది భాగవతోత్తములను ఆదరిస్తూ, నన్ను సత్సంప్రదాయబద్ధునిగా తీర్చిదిద్ది ఈ స్తోత్రమాలను ముద్రించమని ప్రోత్సహించిన పరమభాగవతనిష్ఠులైన **నా తల్లిదండ్రులు శ్రీమతి పొన్నాడ మాణిక్యమమ్మ మరియు శ్రీజగన్నాథ రామానుజ దాసులకు** సాష్టాంగ దండ ప్రణామములు. ఈ స్తోత్రమాలిక కూర్పులో, ముద్రణలో సంపూర్ణముగా సహకరించిన గురుతుల్యులగు ఉభయవేదాంత మహావిద్వాన్ శ్రీమాన్ ఈ.ఏ. శింగరాచార్యుల వారికి అనేక దాసోహములు.

ఇట్లు

భాగవత పాదధూళి,

**పొన్నాడ జనార్దనమ్మ,**

**మధుసూదన రామానుజదాసు**

ఫోన్ : 08942-270064, 949180720.

పరమహంస పరివ్రాజకులు
శ్రీశ్రీశ్రీ త్రిదండి చిన్న శ్రీమన్నారాయణ
రామానుజ జీయరు స్వామివారి మంగళాశాసనములతో...

# పరిణయం

## సుముహూర్తం :

తేది : 04-02-2015
బుధవారం (తెల్లవారితే గురువారం)
మాఘ బహుళ పాడ్యమి
ధనుర్లగ్నమందు

## కళ్యాణ వేదిక :

వరుని స్వగృహమందు
కలివరం గ్రామం
ఆముదాల వలస మండలం

**చి॥ల॥సౌ॥ పద్మజ**

## బంధుమిత్రుల విందు:

తేది : 30-01-2015
శుక్రవారం
మధ్యాహ్నం 12 గం॥లకు
తన్మయి ఫంక్షన్ ప్లాజా, శ్రీకాకుళం

**చి॥ గౌతమ్**

## భాగవత తదియారాధన:

తేది : 06-02-2015
శుక్రవారం
మధ్యాహ్నం 12 గం॥లకు
మా స్వగృహమందు
ప్లాట్ నెంబరు 236, పి.ఎన్. కాలనీ
శ్రీకాకుళం

అస్మద్గురుభ్యో నమః        శ్రీమతే రామానుజాయ నమః        జై శ్రీమన్నారాయణ

జానక్యాః కమలాంజలి పుటే యాః పద్మరాగాయితాః
న్యస్తా రాఘవ మస్తకేచ విలసత్కుంద ప్రమాణాయితాః ।
స్రస్తాః శ్యామల కలితా యా ఇంద్ర నీలాయితాః
ముక్తాస్తా శ్శుభతా భవంతు భవతాం శ్రీరామ వైవాహికాః ॥

**శ్రీమతి & శ్రీ పొన్నాడ జనార్ధనమ్మ**
**మధుసూదన రామానుజ దాసు**

దంపతులు
వ్రాయు శుభలేఖార్థములు!

మా తృతీయ (కనిష్ఠ) పుత్రిక

వధువు : **చి॥ల॥సౌ॥ పద్మజ** ని
M.Sc.(Ph.D.)

వరుడు : **చి॥ గౌతమ్** కు
Software Engineer, USA

(ఆముదాలవలస మండలం, కలివరం గ్రామవాస్తవ్యులు
శ్రీమతి & శ్రీగెడ్డవలస పార్వతి, సూర్యనారాయణ దంపతుల
ద్వితీయ పుత్రుడు)

యిచ్చి వివాహము చేయ దైవజ్ఞులు నిశ్చయించడమైనది.
కావున తామెల్లరూ విచ్చేసి నూతన వధూవరులను ఆశీర్వదించి
మా ఆతిథ్యమును స్వీకరించ ప్రార్థన.

ఇట్లు
భాగవత పాదధూళి
**పొన్నాడ జనార్ధనమ్మ**
**మధుసూదన రామానుజ దాసు**

భాగవతులు, బంధుమిత్రుల అభినందనలతో....